ప్రసిద్ధ వాణి - 1

ప్రధాన సంపాదకులు :

మాలేటి రామప్ప

# వీరేశలింగవాణి

సంకలనకర్త

డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు




అంతర్జాతీయ తెలుగు సంస్థ

హైదరాబాద్-500 027.

viireeSalinga vaaNi

Compiled by

**Dr. Akkiraju Ramapathi Rao**

Title page by

**Sri B. V. Satyamurty**

First Impression

**Feb. 1981**



Published by

**International Telugu Institute**

Barkatpura, Hyderabad - 500 027

**Rs. 3.75**

Printed at

**Padma Power Press**

Kutbiguda, Hyderabad - 27.

# ముందుమాట

ఆధునిక కాలంలో తెలుగు జాతి పునరుజ్జీవనానికి దోహదం చేసిన మహనీయులు కొందరిని సంస్మరిస్తూ స్మారకోపన్యాసాలు ఏర్పాటు చేయాలని అంతర్జాతీయ తెలుగు సంస్థ తలపెట్టింది. అట్టి వారిలో కందుకూరి వీరేశలింగం గారు ఒకరు.

1979 ఏప్రిల్ 16న కందుకూరి వీరేశలింగం స్మారకోపన్యాసాలలో మొదటిది మద్రాసులో ఏర్పాటు చేశాము. ఈ సందర్భంలో సమావేశానికి అధ్యక్షత వహిస్తూ సంస్థ పాలక మండలి అధ్యక్షులయిన విద్యా సాంస్కృతిక మంత్రి శ్రీ భవనం వెంకట్రామరెడ్డి గారు వీరేశలింగం గారి మహితోక్తులను ఒక లఘు గ్రంథంగా సంస్థ వెలువరించాలన్న సూచన చేశారు. తత్ఫలితమే యిది.

ఈ 'వీరేశలింగవాణి' ని సంకలనం చేసి యిచ్చిన డా॥ అక్కిరాజు రమాపతిరావు గారికి, దీనికి ముఖచిత్ర కల్పన చేసి యిచ్చిన శ్రీ బి.వి. సత్యమూర్తి గారికి, ఈ గ్రంథాన్ని అందంగాను త్వరితంగాను ముద్రించిన పద్మా పవర్ ప్రెస్ వారికి మా కృతజ్ఞతలు.

హైదరాబాదు,
1-2-1981

మాటేటి రామప్ప

# విన్నపం

సుమారు నూట ఎనిమిది సంవత్సరాల క్రింతం మచిలీపట్నం నుంచి ఒక సామాజిక సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక వెలువడుతుండేది. దానిపేరు పురుషార్థ ప్రదాయని. 1872 వ సంవత్సరం జూలై నెల సంచికలో ఈ పత్రిక "ఆంధ్రమునందుండవలసిన అగత్యములయిన విషయములు" అని సంపాదకీయం ప్రచురించింది. తెలుగు భాషాసాహిత్యాల లోపాలను ఈ సంపాదకీయంలో ఎత్తి చూపింది." అనేక విధముల లోపములున్నట్లు స్పష్టముగ గానబడుచున్నది. జనులకు పురుషార్థములను సాధించుట కన్నను గొప్పపనిలేదు కదా - ఇట్టి పురుషార్థ సిద్ధికి కొంత కొంతవరకు మిగుల బోధకసాధనములుగా నుండునవి ప్రకృతి శాస్త్రములు, కళలు, చేతిపనులు, జంతుజాతి వర్ణనము, శరీరారోగ్యధర్మములు, జాడ్యవివరములు, వైద్యము, ఓషధిభేద వివరణము, ఖనిజభేదములు, దేశ కాల జీవచరిత్రములు, మతములు, తతత్త్వబోధ, జ్ఞానబోధ, నీతిబోధ, వ్యవసాయ దోహదముల జ్ఞానము, వర్తక వ్యాపారములు, భాషా విషయములు, అలంకారాది శాస్త్ర విషయములు, న్యాయశాస్త్ర విషయములు, దినానుష్ఠేయ కర్మ నిబంధనలు, స్త్రీపురుషనీతి నియామక విధులు, గృహకృత్యముల తీర్పు, పాక విద్యలు, లోక సాంప్రదాయములు. వింతలు, కథలు, వినోదములు, గ్రంథాంతరములైన శ్రేష్ఠ వాక్య పద్యములు, వృత్తాంతములు మొదలగునవి—"తెలుగులో ఇంతవరకూ సులభమైన వచన గ్రంథాలుగా వాడుక భాషలో వెలువడక పోవడం తెలుగు భాషా సాహిత్యవికాసానికి గొప్ప అవరోధంగా ఉన్నది అని పేర్కొన్నది.

నూట ఎనిమిది సంవత్సరాలు గడిచినా ఆనాడా పత్రిక ఆశించినంత సుసంపన్నత తెలుగుభాష కీనాటికీ సిద్ధించలేదు, శాస్త్రీయవిజ్ఞానం ఉన్నతోన్నత స్థాయిన తెలుగులో ఇంకా వెలువడలేదు. విజ్ఞాన సర్వస్వ ప్రచురణం మందకొడిగానే సాగుతున్నది. వివిధశాఖలు విస్తరించనేలేదు, ఇంగ్లీషులో వెలువడుతుండే వివిధ విషయ గ్రంథజాలం నేటికీ తెలుగులో వెలువడటంలేదు, పురుషార్థ ప్రదాయినిలో పేర్కొన్న 'గ్రంథాంతరములైన శ్రేష్ఠ వాక్య పద్యములనే'

ప్రక్రియ బుక్ ఆఫ్‌కొటేషన్స్‌ను దృష్టిలో ఉంచుకొని ప్రస్తావించినదే. తెలుగులో ముఖ్యంగా ఆధునిక సాహిత్యవేత్తల గ్రంథాలనుంచి భావోత్తేజకములైన సూక్తులను, ఆలోచనలను ప్రేరేచే సుభాషితాలను, మార్గ ప్రదర్శకములైన మాట దివ్వెలను ఎవరూ సంకలితం చేసినట్లు కనబడదు.

ఆధునిక సాహిత్య యుగ ప్రవర్తకుడైన వీరేశలింగం భావౌన్నత్యాన్ని సారస్వత కృషిని తెలియజేసే వీరేశలింగంవాణిని అంతర్జాతీయ తెలుగుసంస్థ వారు ప్రసారం చేయడానికి పూనుకొన్నందుకు సర్వదా అభినందనీయులు. ఈ అవకాశం నాకు కలిగించినందుకు ఈ సంస్థవారిపట్ల మిక్కిలి కృతజ్ఞుణ్ణి.

—అక్కిరాజు రమాపతిరావు

# విషయసూచిక


| | | |
|---|---|---|
| వీరేశలింగం - సంక్షిప్త పరిచయం | .... | i–xviii |
| స్వీయ వ్యక్తిత్వావిష్కరణం | .... | 1 |
| రాజ్యాంగ సంస్కరణలు | .... | 11 |
| కులాచార సంస్కరణం-దురాచార నిరాకరణం | .... | 17 |
| మతము - నీతి - ఆస్తిక్యము | .... | 25 |
| లోకరీతి | .... | 32 |
| సంఘ సంస్కరణం | .... | 40 |
| దేశభాషలు - విద్యారంగం - దేశాభిమానం | .... | 50 |
| మహిళోన్నతి | .... | 58 |
| సాహిత్య ప్రయోజనం | .... | 72 |
| బాలబాలికల నుద్దేశించి | .... | 79 |

# వీరేశలింగం

"వీరేశలింగంవంటి సంఘసంస్కర్త, యటువంటి ధైర్యశాలి, యటువంటి కార్యశూరుడు, నటువంటిస్వార్థత్యాగి, యటువంటి లోకోపకారపరాయణుడు, కొన్ని వందల సంవత్సరములకు గాని మన దేశమున జన్మింపడని నా దృఢమైన విశ్వాసము."

అన్నారు చిలకమర్తి లక్ష్మీనరసింహకవి. అంతేకాదు.

"మహావీరుడు, కార్యశూరుడు, ఆస్తిక మతావలంబకుడు, సంఘ సంస్కర్త, వచనరచనా పితామహుడు, శతాధిక గ్రంథకర్త, మహాదాత, మహాకవియైన వీరేశలింగ మహామహుని చరిత్రమును, నాంధ్రదేశమందు జనించిన ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీయు జదివి యందుగల వందలకొలది నీతి పాఠముల నేర్చుకొని ధన్యులగుదురుగాక. ప్రబంధములకన్న, నవలలకన్న, నాటకములకన్న, దేశములను, సంఘములను నుద్ధరించి మహితకార్యములకు మార్గదర్శకులైన మహామహుల యుత్తమ చరిత్రములే దేశమునకు జాతికి మహోపకారము జేయు నన్నమాట పాఠకలోకము మరువకుండుగాక." అని కూడా హెచ్చరించారు. వీరేశలింగ మహాశయుని సమగ్రమైన మూర్తిమత్వం ఈ మాటలలో సాక్షాత్కరిస్తుంది.

వీరేశలింగం డెబ్బైఒకసంవత్సరాలు జీవించాడు. ఒక అర్ధశతాబ్ది కాలం తెలుగు దేశాన్ని, తెలుగు సాహిత్యాన్ని తన సంఘసంస్కరణ కార్యక్రమం ద్వారా, అసంఖ్యాకమైన రచనలద్వారా ఎంతగానో ప్రభావితంచేశాడు.

వీరేశలింగంనాటి తెలుగు దేశపు సామాజిక పరిస్థితులను స్పష్టంగా తెలుసుకుంటే తప్ప ఆయన గొప్ప తనాన్ని చక్కగా అంచనా వేయలేము. తెలుగు దేశంలోని సామాజిక సాంస్కృతిక సాహిత్య పునరుజ్జీవనోద్యమానికాయన ఉదయతార. ఆయన జన్మించినకాలం ఒక సంధికాలం.

ఆ కాలంచేత ఆయన ప్రభావితుడైనాడు. తానూ తన కాలాన్ని ప్రభావితం చేశాడు. అదే ఆయన గొప్పతనం. తెలుగుసాహిత్య చరిత్రలో ఇదేమీ అపూర్వమైన విషయం కాకపోయినా, సాహిత్యయుగ కర్తృత్వానికిది ఒక విలక్షణమైన, విశిష్టమైన సంకేతంగా గుర్తించవలసివుంది. దక్షిణదేశంలో గొప్పమత సంస్కరణోద్యమ కర్తలైన రామానుజులు, బసవడు కూడా తమకాలంవల్ల ప్రభావితులై, ఆ కాలాన్ని ప్రభావితం చేసినవారే. తెలుగు సాహిత్యంలో తిక్కన, పాల్కురికి సోమనవంటి సాహిత్యోద్యమ కర్తలకు కూడా ఈ విశిష్టత వర్తిస్తుంది.

ఆధునిక కాలాన సాహిత్యాన్ని పటిష్ఠమైన ఆయుధంగానే చేసుకొని సమాజాన్ని ప్రభావితంచేసిన మహనీయులలో వీరేశలింగం మొదట చెప్పదగిన వాడు ఆధునిక సాహిత్యచరిత్ర ఆయనతోనే ప్రారంభమవుతున్నది.

తరతరాల తెలుగు దేశపు మహా పురుషుల, సేనాధిపతుల రక్తం ఆయనలో సంక్రమించబట్టే ఆయన అటువంటి ఘనకార్యాలు చేయగలిగాడు. అని గురజాడ అప్పారావు కూడా వీరేశలింగాన్ని మెచ్చుకోవడం గమనించదగ్గ విషయం. అమితమైన ఆత్మశక్తిగలవాడాయన. అధర్మం, అక్రమం, అన్యాయాల విషయంలో అజేయంగా నిలిచి పోరాడగలిగిన ధీశాలి. "ఎక్కడ ఏ అక్రమము జూచినను వాది సహించి యూరకుండెడి స్వభావము కాదు." అని స్వీయ చరిత్రలో ఆయన ప్రస్తావించాడు. అటువంటి అక్రమాలకు ప్రతిక్రియ కలిగేదాకా నిలిచి పోరాడేవాడు. సమకాలీన సమాజంలోని దుష్ట శక్తులతో పోరాడటమూ, తెలుగు సాహిత్యాన్ని నవనవోన్మేషంగా, ప్రక్రియా వైవిధ్య సముపేతంగా విలసిల్లజేయడమూ తన ఉచ్ఛ్వాసనిశ్వాసాలుగా అర్ధ శతాబ్ది కాలం ఆంధ్రదేశానికి సేవ చేసిన మహానుభావు డాయన.

ఆయనలోని గుణ బాహుళ్యాన్ని అంగీకరిస్తూనే ఆయనలోని దోషలేశాలను పెద్దవిగా చేసి చూపే ధోరణి నేటి కాలానికి కొంత తల ఎత్తుతూ వుండడం విచారకరం. మానవీయమైన కొన్ని బలహీనతలకు ఆయన అతీతుడేమీ కాదనీ, ఆయన తలపెట్టి సాధించిన సంఘ సంస్కరణ కార్యక్రమాలు స్థిరమైన, దీర్ఘకాలిక ప్రయోజన ప్రాతిపదికములు కావనీ, ఆయనకు సనాతన ధర్మం గురించి సరిగా తెలియదనీ విమర్శించబూనడం నిష్ప్రయోజనం. నాటి సమాజంలో కనబడుతున్న చెడుగులను గూర్చి ఆయన చాలా బాధపడ్డాడు. ఓపినంత మేరకు

వాటిని తొలగించడానికి కృషి చేశాడు. అంతేకాని వర్గ పోరాటాన్ని గురించిగాని, గతితార్కిక భౌతిక వాదాన్ని గురించిగాని ఆయనకు తెలియదనడం సబబైన ధోరణికాదు. బ్రాహ్మ సమాజం, ఆర్య సమాజం ఆయన్ను ప్రభావితం చేసిన మాట నిజమే. అవి ఆయన ఉదార మానవతావాదానికి, హేతువాద దృక్పథానికి ప్రేరణ కలిగించాయి. వేద ప్రామాణ్యాన్ని, విగ్రహారాధనను ఆయన అంగీకరించ లేదు. దివ్యజ్ఞాన సమాజం వారి సిద్ధాంతాలు, విశ్వాసాలూ ఆయనకు ఎంత మాత్రమూ గిట్టలేదు. ఇంకొక పది సంవత్సరాలు జీవించి వుంటే జాతీయోద్యమాన్ని కూడా ఆయన పూర్తిగా సమర్థించి వుండేవాడు. రాజ్యాంగ సంస్కరణలకు, స్వాతంత్ర్య సముపార్జనకు నేను వ్యతిరేకినికాను అని ఆయన చెప్పు కొన్నాడు. అయితే ఆనాటి వందేమాతరం ఉద్యమ తీవ్రత నాయన సమర్థించ లేదు. పైపెచ్చు విమర్శించాడు కూడా. అది నేడు మనకు బాధా కారణం కావచ్చునేమోకాని ఆయన వ్యక్తిత్వానికి కళంకాపాదకమైన దానినిగా మనం చిత్రించ కూడదు. జాతీయ చైతన్యోద్బోధకంగా ప్రారంభమై, అటు తర్వాత స్వాతంత్ర్య సముపార్జనోద్యమంగా పరిణమించిన జాతీయోద్యమంలో తన చరమ దినాలలో వీరేశలింగం తగినంత తాదాత్మ్యం చూపలేక పోయినాడని, ఒక్కొక్కసందర్భంలో ఈ ఉద్యమాన్ని ఆయన వ్యతిరేకించాడని ఈనాడు ఆయనను తప్పు పట్టడం, ఆయన కాలాన్ని గూర్చి, ఆయన వ్యక్తిత్వాన్ని గూర్చి సరైన అవగాహన కాదనాల్సి వస్తుంది. ఆయన జీవిత కాలంలో ఎప్పటికప్పుడు సామాజికమైనవిగాని, సాహిత్యపరమైనవిగాని, అభ్యుదయ ధోరణులనే ఆయన ఆశ్రయిస్తూ వచ్చాడు. గిడుగు రామమూర్తి పంతులు వ్యావహారిక భాషావాదాన్ని సమర్థించడమూ, వర్తమానాంధ్ర భాషాప్రవర్తక సమాజానికి వ్యవస్థాప కాధ్యక్షులుగా ఉండడానికి వీరేశలింగం అంగీకరించడం ఇందుకు ప్రబలమైన తార్కాణం కాదా! తెలుగు దేశంలో బాల బాలికలు కలిసి చదువుకొనే విద్యావిధానాన్ని, అట్టడుగు తరగతుల వారిని వెలివేయకుండా అందరిలో కలుపుకొని వారికి ఉచితంగా చదువుచెప్పే ఏర్పాట్లను ముందుగా ప్రారంభించిన వాడు వీరేశలింగమే. అందువల్ల ఆయన అభ్యుదయ పథ ప్రవర్తకుడు.

సమాజంపై పాతకాలపు శిథిల విశ్వాసాలు, శిలాజ సదృశమైన జీవన విధాన ధోరణులు, వీరేశలింగం కాలానికి ఇంకా తమపట్టును పోగొట్టుకోలేదు. ఆనాటి ఆర్థిక రాజకీయ సామాజిక వ్యవస్థకు దా ఆందకు ప్రబలంగా దోహదం

చేసి ఉండవచ్చు. విభిన్నమైన సామాజిక జీవన వ్యవస్థలు మత విశ్వాసాలు, నైతిక ప్రవర్తన నియమావళులు సాంస్కృతిక విలువలుగల జాతీయ సంస్కృతుల పరస్పర సన్నికర్షవల్ల ఏ దేశంలో అన్నిరంగాలలోనూ నూతనధోరణులు బయలుదేరినవి. పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధానికి విజాతీయ సాంస్కృతిక ప్రభావం సాహిత్యంలోకూడా బాగా కన్పించింది. తెలుగు దేశంలో తెలుగు సాహిత్యంలో ఈ నూతనమైన నవ సంచలనాన్ని విస్తరింపచేసినవాడు వీరేశలింగం. అందువల్లనే ఆధునిక సాహిత్య చరిత్రలో, ఆధునిక సామాజిక చరిత్రలో ఆతని మూర్తిమత్వం అంత ప్రస్ఫుటంగా కనబడుతున్నది.

ఆధునికాంధ్రదేశం అనేది గోదావరి అయితే అది పుట్టిన నాసికాత్ర్యంబకం వీరేశలింగం అన్నారు స్వర్గీయ దేవులపల్లి కృష్ణశాస్త్రి. ఇది అక్షర సత్యం. వీరేశలింగం జన్మించి నేటికి నూటముప్పై సంవత్సరాలు గడిచాయి. ఆయన పరమపదించి కూడా ఏభైపైన ఏళ్లు గడిచిపోయాయి. అయినా తెలుగువాళ్లు వీరేశలింగాన్ని గూర్చి తలచుకుంటూ ఆయన నుంచి స్ఫూర్తి పొందాలని కోరుకుంటూనే ఉన్నారు. ఆయన గొప్పతనానికి ఇది ఒక తార్కాణం. వీరేశలింగం జన్మించటానికి నలభై సంవత్సరాలకు పూర్వం తెలుగు దేశంలో నెలకొని ఉన్న పరిస్థితులు, ఆయన జన్మించిన తర్వాత నలభై సంవత్సరాలకు సంఘంలో కనపడిన భావ సంచలనం పోల్చిచూస్తేకాని వీరేశలింగం సాధించిన సామాజిక విప్లవం ఎటువంటిదో తెలియదు. అయితే తెలుగు దేశమంతా వీరేశలింగం సంఘ సంస్కరణ కృషితో పూర్తిగా పరివర్తితమై పోయింది, సాంఘిక విలువల దృష్ట్యా ఉత్తమస్థాయి నందింది అని చెప్పలేము. ఆయన తన కాలంలో పోరాడిన దుష్టశక్తులు కొన్ని ఇంకా నిర్మూలం కానేలేదు. పైగా ఇంకా ఎన్నో కొత్తకొత్త సమస్యలు ఎదుర్కొవలసి వస్తున్నది నేడు, అయినా వీరేశలింగం జీవితంనుంచి ఒక ఆదర్శాన్ని ఒక స్థైర్యాన్ని అనుభూతం చేసుకోవచ్చు. అంగబలమూ అర్థబలమూ, మందీ మార్బలమూ కూర్చుకొని తర్వాత దేశసేవ చేస్తామనే వాళ్ళలా కాకుండా, కేవలం ఆయన తన ఆత్మశక్తితోనే ఘనకార్యాలెన్నో నిర్వహించాడు.

వీరేశలింగం పుట్టుకతోనే శారీరకంగా చాలా దుర్బలుడు. లక్షలూ కోట్లూ రాబడిగల సంస్థానాధిపతి కాడు. చేసింది తెలుగు పండితుడి ఉద్యోగమేగాని, పరువూ ప్రతిష్ఠా రాబడిగల సర్కారీ ఉద్యోగం కాదు. సుమారు ముప్పై సంవత్సరాలు ఉపాధ్యాయత్వం నిర్వహించాడు. కాని సామాన్యులెవరూ చేయలేని గొప్ప

సాహసాల నెన్నిటినో ఆయన చేసి చూపాడు. ఆయన జన్మించిన శతాబ్దానికంతా ఆయన ప్రముఖుడు కాగలిగాడు.

ఆయన కుటుంబానికంతటికీ ఆయనే ఏకైక వారసుడు. ఆయన వివాహం చేసుకున్న ఇంటినుంచి కూడా సహాయ సంపత్తులేవీ ఆయనకు అందలేదు. అన్నిటా ఒంటరివాడు. అయినా అద్భుతాలెన్నో సాధించాడు వీరేశలింగం.

వీరేశలింగం జన్మించిన కాలానికి తెలుగు దేశంలో అనర్థకరమైన, అస్తవ్యస్తమైన సాంఘిక దురాచారాలెన్నో చలామణిలో ఉండేవి. ఆయన జన్మించటానికి సుమారు పాతిక సంవత్సరాల పూర్వం వరకూ తెలుగు దేశంలో సహగమనం కూడా అమలులో ఉన్నట్లు సాక్ష్యాధారాలున్నాయి. 1823 వ సంవత్సరంలో ఇలాటి సహగమన వృత్తాంతాన్ని తాను చూశానని వెన్నెలకంటి సుబ్బారావు గారనే ఆయన తన జీవయాత్రా చరిత్రలో ఉదహరించారు. గుంటూరులో తూము పాపయ్యగారనే వారు చనిపోయినప్పుడు, ఆయన ఇల్లాలు సహగమనం చేసినట్లు, అప్పుడక్కడ ఉండి ఆ సంఘటనను చూసినట్లు ఈ వెన్నెలకంటి సుబ్బారావుగారు రాశారు. ఇదీకాక వీరేశలింగం జన్మించడానికి ముప్పై నలభై సంవత్సరాల పూర్వం ఇలాటి సహగమన సన్నివేశాలు తెలుగు దేశంలో సంభవిస్తున్నట్లుగా మనం భావించడానికి కొన్ని ఆధారాలున్నాయి. కృష్ణా జిల్లాలో ఇప్పుడు సుప్రసిద్ధమైన ఉయ్యూరు. ఉయ్యూ అనే పేరంటాలు పేరిట వెలసిన ఊరే అని, నోబిల్ అనే క్రైస్తవ విద్యావేత్త జీవిత చరిత్ర ద్వారా తెలుస్తున్నది. పేరంటాలు అంటే భర్తతో సహగమనం చేసిన పుణ్య స్త్రీ అని అర్థం. ఇంతేకాకుండా పంధొమ్మిది వందల ఇరవై రెండో సంవత్సరంలో ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారనే సుప్రసిద్ధ విద్వాంసులొకరు గ్రామదేవతలు అనే పేరిట ఒక వ్యాసం రాశారు. అందులో తెలుగు దేశంలో ఈ సహగమనం కిందటి శతాబ్దిలో మొదటిపాదం వరకూ చెదురుమదురుగా నైనా ఆచరణలో ఉండేదన్న విషయం వారు రాశారు. అలాంటి పేరంటాలు స్మృతి చిహ్నంగా తమ ఇంట్లో పూజామందిరంలో ఆ సహగమనం చేసిన ముత్తైదువ తమకు ఇచ్చిపోయిన వస్త్రం తాలూకు జీర్ణశకలాలను పూజిస్తూ ఉండేవారని కూడా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రాశారు. ఇట్లానే మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారనే మహానుభావుడు, మహాకవి తమ స్వీయచరిత్ర అయిన 'ఆత్మపర్యాయ సపర్యాచర్య' అనే నామాంతరం గల

హరిహరేశ్వర శతకంలో తమ కుటుంబంలో జరిగిన సహగమన వృత్తాంతాన్ని ప్రస్తావించారు. మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు 1897 వ సంవత్సరంలో పరమ పదించారు. అంటే అంతకు పూర్వం నలభై యాభై సంవత్సరాల కాలంవరకూ తెలుగుదేశంలో ఈ ఆచారం కూడా ఉండేదని అనుకోవచ్చు. ఇంతేకాకుండా వీరేశలింగం రచన ఒకదాని ద్వారా కూడా ఈ విషయం మనం ఊహించవచ్చు. వీరేశలింగం రచించిన సత్యవతీ చరిత్రం తెలుగులో తొలి సాంఘిక నవల. దీని నాయన 1883 లో ప్రకటించాడు. ఈ నవలలో నాయిక సత్యవతి. ఈమె ముత్తవ్వ ప్రసక్తంగా తాను చిన్ననాడు స్వయంగా చూసిన ఒక సహగమన సన్ని వేశాన్ని మనుమరాలికి వర్ణించి చెపుతుంది. వర్ణించి చెప్పడమేకాకుండా, అటు వంటి మంచి ఆచారాన్ని, తెల్లవాళ్లు వచ్చి నాశనంచేశారని కూడా వాపోతుంది. బహుశా వీరేశలింగం తన ముత్తవ తల్లినుంచి ఆమె చిన్ననాటి అనుభవాలు వింటూ ఇలాటి సహగమన వృత్తాంతాన్ని వినివుంటాడనీ, దానినే తన నవలలో ఒక సన్నివేశంగా వాడుకున్నాడనీ మనం అనుకోవచ్చు. స్వీయచరిత్రలో ఆయన తన బాల్యంలో కాలువిరిగి మంచానపడ్డ ముత్తవతల్లితో ఎప్పుడూ ఏదో పుక్కిటి పురాణంతో కాలక్షేపంచేస్తూ ఉండేవాణ్ణని రాసుకోవడం పైన పేర్కొన్న సత్యవతీ చరిత్రలోని సంఘటనతో బాగా సమన్వయ మవుతుంది.

ఇంట్లో తానొక్కడూ తప్ప మరెవరూ బాలబాలిక లుండేవారు కారు. పెత్తండ్రికి సంతానంలేదు. తన తండ్రి తనకు నాలుగేళ్ళప్పుడే కన్నుమూశాడు. తన తల్లి, తండ్రి తల్లి, తాతతల్లీ కూడా తలచెడిన వాళ్లే. ఇంట్లో ఉండేవాళ్ళు. వీరేశలింగం పుట్టటానికి ఒక్క సంవత్సరముందే ఆయన తాత కాలగతి నొందారు. వంశాంకురం కాబట్టి అమిత గారాబం. వంశాని కంతకూ ఒకే ఒక నలుసుకాబట్టీ, పుట్టుకతోటే పరమార్భకుడు కాబట్టి, ఇరుగుపొరుగు ఇళ్ళకు వెళ్ళ ఆడనిచ్చేవారు కాదు వీరేశలింగాన్ని. అందువల్ల అవ్వతో కబుర్లు చెబుతూ పొద్దు పుచ్చేవాణ్ణని ఆయన స్వీయచరిత్రలో రాసుకున్నాడు. ఈ కబుర్లలో ఎప్పుడో ఆమె తన మంచికాలం నాటి సహగమన సంప్రదాయం గురించి చెప్పివుంటుంది. ఈ వివరాలన్నీ సత్యవతీ చరిత్రంలో వీరేశలింగం సత్యవతి నాయనమ్మ పార్వ తమ్మగారి నోటి వెంట సన్నివేశ బద్ధంచేశాడు.

ఇంత విపులంగా ఇక్కడ ఈ ప్రసక్తి ఎందుకు తేవాల్సి వచ్చిందంటే, సాంఘిక దుష్ట విశ్వాసాల విషయంలోనూ, దురాచారాల విషయంలోనూ, ఇతర

భారతదేశంతో పాటే తెలుగు దేశం కూడా దుర్భర పరిస్థితులకే ఆలవాలమై ఉందని చెప్పడానికే.

అందుకే వీరేశలింగం ఎంతో ఆవేదనతో తననాటి సాంఘిక పరిస్థితులను గూర్చి ప్రస్తావించాడు. 'లంచాలు వద్దంటే రాజకీయోద్యోగులకు కోపం. వేశ్యా సంగమం నీతికాదంటే శృంగార పురుషులకు కోపం. దురాచారాలు రూపుమాప వలెనందంటే పామరజనులకు కోపం'-ఈ విధంగా ఎందరి కోపాలకో గురికావలసి వచ్చింది, నేనూ నా పత్రికా కూడా-అని రాసుకున్నారు వీరేశలింగం.

పాతిక సంవత్సరాల వయసుననే వీరేశలింగం పత్రికను ప్రారంభించాడు-ప్రజల్లో ఉత్తమమైన విజ్ఞాన వికాసాలను పెంపొందించాలనీ, చెడునడతలను మాన్పాలనే ధ్యేయంతో. బహుశా తెలుగులో వెలువడిన మొట్టమొదటి సామాజిక పత్రిక వీరేశలింగం నడిపిన వివేకవర్ధనే నేమో అనాల్సి వస్తుంది. అంతకుముందు ఏవో రెండుమూడు పత్రికలు వెలువడక పోలేదు. అయితే అవన్నీ భాషా సాహిత్య విషయాలను గూర్చి ఎక్కువగా కృషిచేసినవి. వీరేశలింగం నడిపిన వివేకవర్ధని కన్నా రెండేళ్ళు ముందుగానే ప్రారంభమైన పురుషార్థ ప్రదాయిని అనే పత్రిక కూడా సామాజిక చైతన్యంకోసం కృషిచేసింది. అయితే సమాజవికాసంకోసం, కులాచారాలు, స్త్రీవిద్య, రాజకీయోద్యోగుల అక్రమ ప్రవర్తనలు గురించి పత్రికలో ప్రచురిస్తూ వచ్చినా, నీతిమత సాహిత్య వినోద విజ్ఞానాలకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తూవుండేది. వివేకవర్ధనిలాగా నిర్భయంగా కత్తిచేతపట్టి సంఘంలోని అక్రమాలతో పోరాటానికి దిగలేదు. వీరేశలింగానికి అంత చిన్నవయసున అండదండ లేమున్నాయి? పత్రికను నిర్వహించగలవనరు లేమున్నాయి? సహాయ సహకారా లేమున్నాయి! అయినా ఆయన సుమారు ఇరవై సంవత్సరాలు తన పత్రికను నడిపి సంఘంలో ఎంతో చైతన్యాన్ని తీసుకొనివచ్చాడు. ఆ పత్రికనే ఆయుధంగా చేసుకొని ఎన్నో ధర్మయుద్ధాలను సాగించాడు. కోర్టుల కెక్కాడు. బలవద్విరోధులతో తలపడ్డాడు.

1874 వ సంవత్సరం అక్టోబర్‌నెలలో వీరేశలింగం వివేకవర్ధనిని ప్రారంభించాడు. అప్పుడాయన ధవళేశ్వరంలో పాఠశాలోపాధ్యాయుడు. తన భావాలను, సిద్ధాంతాలను, ఆలోచనలను ప్రజలలో ప్రచారం చేయాలంటే, ఒకానొక పత్రికను నడపవలసిన అగత్యాన్ని ఆయన గుర్తించి శ్రమ సాధ్యమైన, సాహసోపేతమైన

పనికి పూనుకున్నాడు. సాహిత్యవేత్తగా, పండితుడిగా ఆయనకు అప్పటికే గుర్తింపు వచ్చింది తెలుగు దేశంలో. ఆయన రచనలు కొక్కొండ వెంకటరత్నం పంతులు వంటి సాహిత్య నిష్ఠాగరిష్ఠుడు తన పత్రిక ఆంధ్రభాషా సంజీవనిలో ప్రచురించాడు. ఆ రోజుల్లో బందరునుంచి వెలువడుతూ వచ్చిన పురుషార్థ ప్రదాయిని వీరేశలింగాన్ని కవిగా గుర్తించి ఆయన శుద్ధాంధ్రోత్తర రామాయణాన్ని ప్రచురించింది. పాతిక సంవత్సరాలన్నా నిండాకుండానే ఆయన రచించిన వ్యాకరణ సంగ్రహాన్ని పాఠశాలలు పాఠ్యపుస్తకంగా చేశాయి. చిన్నయసూరి విడిచిపెట్టిన నీతి చంద్రిక ఉత్తరార్థంలో సంధి విగ్రహాలుకూడా, ఆయన శైలితో ప్రతిస్పర్ధ వహించినట్లుగా రచించి ప్రకటించాడు. అదీ పాఠశాలల్లో పాఠ్యపుస్తకంగా గుర్తింపు పొందింది. కొక్కొండ వెంకటరత్నం తన విగ్రహ తంత్రాన్ని విమర్శించగా, ఆయన మళ్ళీ సమాధానం కూడా చెప్పుకోలేనట్లు వెంకటరత్న కవి కృతవిగ్రహ తంత్ర విమర్శనమూ అప్పటికే ప్రకటించాడు వీరేశలింగం. ఆంధ్రభాషా సంజీవనిలో ప్రచురితమైన శుద్ధాంధ్ర భారత సంగ్రహం రచనకు ముచ్చటపడి బహుజనపల్లి సీతారామాచార్యుల వారి వంటి బహు విశ్రుతుడు సమ్మానించాడు వీరేశలింగాన్ని. చిన్నతనంలోనే దుష్కరప్రాసలతో రెండు శతకాలనూ సాధించాడు వీరేశలింగం. పాతికేళ్లు రాకుండానే శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం, రసికజన మనోరంజనం వంటి ప్రౌఢరచనలూ చేసి ఉన్నాడు. మరి తన ఆదర్శాలు లోకానికి వెల్లడించాలని, సామాజిక చైతన్యం తీసుకొని రావాలనీ పత్రికను ప్రారంభించిన వీరేశలింగం, సాహిత్య విషయికమైన కృషికికూడా అందులో చోటివ్వకపోవడం ఎలా సంభవిస్తుంది?

సాహిత్యమూ, సంఘసంస్కరణమూ ఆయన రెండు కళ్ళు. సంఘంలో ఉన్న కుళ్ళునంతా నాశనం చెయ్యాలి. నవనవోన్మేష భరితంగా సాహిత్యాన్ని వికసింప చెయ్యాలి. ఈ రెండూ ఆయన పరమాశయాలు. తన జీవితకాలమంతటినీ ఆయన ఈ ఆశయసాధనకోసమే వినియోగించాడు.

తన దేహము తన గేహము
తన కాలము తన ధనమ్ము తన విద్య జగ
జ్జనులకు వినియోగించిన
ఘనుడీ వీరేశలింగకవి జనులారా _

అని ఆయన సమాధి ఫలకంమీద ఆయన త్యాగ జీవితం శిలాశాసనమైవుంది. ఇంచుమించుగా అర్ధ శతాబ్దికాలం, ఇటు సమాజ శ్రేయస్సుకోసం, దురాచార నిర్మూలన రూపమైన సంఘ సంస్కరణం కోసమూ, నాగరిక ప్రపంచ సారస్వత స్థాయిని తెలుగు భాషా సాహిత్యాలు వికసించటం కోసమూ ఆయన అహరహమూ శ్రమించాడు. అన్నిటా అభ్యుదయగామి వీరేశలింగం అన్నిటా ముందడుగే ఆయనది. నిరంతర క్రాంతదర్శి ఆయన. త్రికరణశుద్ధిగా దేనినైతే విశ్వసిస్తాడో దానిని వెంటనే ఆచరణ సాధ్యమని నిరూపించవలసిందే. అప్పటిదాకా ఆయనకు చిత్తశాంతి ఉండదు. అది సాంఘిక సంస్కరణమైనా, సాహిత్య సంస్కరణమైనా వెంటనే అమలులోకి తేవలసిందే! 'భాషలకు ప్రయోజనమేమిటి?' అని ఆయనకొక విచికిత్స కలిగింది. సాంఘిక సంస్కరణోద్దేశకంగా ఉండవద్దా సాహిత్యం అని మధన కలిగింది. వెంటనే ఒక నిర్ణయానికి వచ్చేశాడు. అనూచానంగా ఆనాటివరకూ వస్తున్న కావ్యాలవల్ల, ప్రబంధ ప్రక్రియలవల్ల, సాహిత్య ప్రయోజనం సిద్ధించదని నిర్ణయించుకొన్నాడు. ఆ దృష్టితో ప్రచురించిందే అభాగ్యోపాఖ్యానం వీరేశలింగం ప్రతి. ఈ కావ్యరచనలో నికట కవులందరినీ మించిపోయింది. వివేకవర్ధనిలోనే అభాగ్యోపాఖ్యానం ప్రచురించాడు. ఈ లోపున కొక్కొండ వెంకటరత్నం పంతులుతో భాషా విషయికంగా, సామాజిక విశ్వాసాల విషయికంగా తీవ్రమైన భేదాభిప్రాయాలూ కలిగాయి. ఆయనతో ఒక పక్కన వాద వివాదాలూ సాగాయి.

కొక్కొండ వెంకటరత్నం పంతులు, వీరేశలింగం సాగిస్తున్న సాహిత్య సాంఘిక సంస్కరణలకు న్యూనత కలిగించాలనే ఉద్దేశంతో హాస్యవర్ధని అనే పేరుతో తన ఆంధ్రభాషా సంజీవనికి ఒక అనుబంధ పత్రికను ప్రచురించడానికి పూనుకొన్నాడు. వీరేశలింగానికిది దుస్సహ మనిపించింది. తాను కూడా ఆంధ్ర భాషా సంజీవనిని, ఆ పత్రికాధిపతిని అపహాస్యంచేసే ఉద్దేశంతో హాస్య సంజీవని అనే పత్రికను తన వివేకవర్ధనికి అనుబంధంగా ప్రచురించడానికి పూనుకొన్నాడు. వీళ్ళిద్దరి ఈ స్పర్ధవల్ల ఆధునిక తెలుగు సాహిత్యానికి ఒకమేలు చేకూరింది. అదేమంటే ప్రహసన వాఙ్మయం పరిపుష్టం కావడం. తెలుగులో అంతకు పూర్వం ప్రహసనాలులేవు. ప్రహసనమనేది ఒక ప్రత్యేక ప్రక్రియగా అటు తర్వాత తెలుగు సాహిత్యంలో నెలకొన్నది.

ఈ హాస్య సంజీవని పత్రికకోసమే వీరేశలింగం బ్రాహ్మ వివాహం రచించాడు. ఈ బ్రాహ్మ వివాహం గురజాడ కన్యాశుల్కంకన్నా సుమారు ఇరవై సంవత్సరాల ముందు అదే సమస్యపై వచ్చిన ప్రహసన ప్రాయమైన నాటకం. ఇందులో వృద్ధ వివాహాలవల్ల కలిగే అనర్థాలు, కన్యాశుల్కంవల్ల సంఘంలో కలుగుతున్నహాని, ఇతివృత్తంగా చేసుకున్నాడు వీరేశలింగం. ఈ ఇతివృత్త కేంద్ర బిందువు చుట్టూ సంఘంలోని ఎన్నో చెడుగులు, దురాచారాలు, అక్రమాలు, అన్యాయాలు, అన్యాపదేశంగా చిత్రించాడు. బ్రాహ్మ వివాహం ప్రారంభం కాగానే, ఆ మడుసటి సంచికకు వందలాది కొత్త చందాదారులు చేరారుట. ఆ రోజుల్లో కొత్తగా చందాదార్లుగా చేరిన వారి పేరు పత్రికలో ప్రచురించేవారు. బహుశా అదికూడా ఆ రోజుల్లో ఒక విధమైన వ్యాపార ప్రకటనగా, ప్రచార సాధనగా ఉపయోగించేవనుకోవాలి.

ఈ విధంగా వివేకవర్ధనికి అనుబంధంగా మొదలైన హాస్య సంజీవనిలో బ్రాహ్మ వివాహం ప్రచురణ ప్రారంభం కాగానే, చేరిన చందాదారుల పేర్లు ప్రకటిస్తే పత్రికలో మరే రచనా ప్రకటించడానికి అవకాశంలేనంతగా అత్యధిక సంఖ్యాకులు చందాదారైనారు అని వీరేశలింగం రాశాడు. ఈ బ్రాహ్మవివాహం ముగిసిన తర్వాత వ్యవహార ధర్మబోధిని అనే పేరుతో ఇంకో ప్రహసన ప్రాయమైన నాటకాన్ని వీరేశలింగం ప్రారంభించాడు హాస్యసంజీవనిలో. వీరేశలింగం పాండిత్యస్ఫోరకంగా ఈ పేర్లు పెట్టినా ప్రజలు ఈ రచనలను అభిమాన పూర్వకంగా తమకు అవగాహన అయిన రీతిలో పిలుచుకొని ఆనందించారు. బ్రాహ్మ వివాహాన్ని వాళ్ళు పెద్దయ్యగారి పెళ్ళి పుస్తకమనీ, వ్యవహార ధర్మ బోధినిని ప్లీడరు నాటకమనీ వ్యవహరించి ఆనందించారు. ఆ రోజుల్లో అక్షరాస్యుల సంఖ్య మరీ తక్కువగా ఉండేదికాబట్టి, ఏ ఇంటి అరుగుమీదనో చేరి చదవనేర్చినవాడెవరైనా పెద్దయ్యగారి పెళ్ళి పుస్తకాన్నో, ప్లీడరు నాటకాన్నో చదవడానికుపక్రమిస్తే వీధుల్లో గుంపులు గుంపులుగా చేరి ప్రజలు విని ఆనందించే వాళ్ళుట.

పెద్దయ్యగారి పెళ్ళి పుస్తకంలో ఆనాటి అగ్రవర్ణాల వారిలో ప్రచురంగా సాగుతున్న దురాచారాలన్నీ వర్ణితమైనాయి. నిర్బంధవైధవ్యం, అతి బాల్య వివాహాలు, వృద్ధ వివాహాలు, వివాహాలకై తలకు మించిన ఖర్చులు, మొదలైనవి. ప్లీడరు నాటకంలో న్యాయవాదులమని చెప్పుకొనే వారి అన్యాయాలు, అక్రమ ప్రవర్తనలు, పోలీసు శాఖలో విచ్చలవిడిగా సాగుతూ ఉన్న అవినీతి, దౌర్జన్యం,

వర్ణించారు. అమాయకులను కడగండ్లపాలు చేయడంలో నాటి అధికార యంత్రాంగం ఏ విధంగా కుమ్మక్కు అవుతూ ఉండెనో, ఆ పద్ధతులు ప్లీడరు నాటకంలో జాలి కలిగేట్లు వర్ణించారు పంతులుగారు. అందువల్ల ఈ రెండు రచనలూ కూడా ఆబాల గోపాలానికీ ప్రీతి పాత్రములే అయినాయి. ప్లీడరు నాటకాన్ని వీరేశలింగం పంతులుగారి శిష్యులు రంగస్థలం మీద ప్రదర్శించారు కూడా.

ఈ విధంగా ఒకవైపున నూతనమైన ప్రక్రియలను సృష్టిస్తూ సాహిత్యంలో కొత్తకొత్త మార్గాలు తీస్తూ కూడా, ప్రజల ఆచార వ్యవహారాలలో, నడవడుల్లో మంచి మార్పులు తీసుకొని రావాలని కూడా బద్ధ కంకణుడైనాడు వీరేశలింగం. సంఘంలో ఆనాడు వేశ్యలకున్న పలుకుబడి అపారం. అధికార వర్గాలవారిలోనూ, కలిమిగల కాపరాలలోనూ వేశ్యల ప్రాబల్యం విషపలయంగా పరిణమించింది. వేశ్య నాదరించనివాడు పురుషుడేకాడు అనుకునేటంత దుస్థితి సంప్రాప్తించింది అని తమ స్వీయచరిత్రలో ఆనాటి పరిస్థితులను వర్ణించాడు వీరేశలింగం. వివేక వర్ధని ద్వారా ఈ అంటువ్యాధిని రూపుమాపాలని పూనుకున్నాడు.

కృతకృత్యుడూ కాగలిగాడు. వేశ్యాసమస్యపై కత్తి ఝళిపిస్తూనే, ప్రభుత్వోద్యోగుల్లోని లంచగొండి తనాన్ని బట్టబయలుచేసి, ఆ అక్రమవర్తనను నయానా భయానా అరికట్టాలని విశేషకృషిచేశాడు. ఇందువల్ల స్థానిక న్యాయస్థానాల్లో ఆయన కొన్ని అభియోగాల విచారణను ఎదుర్కోవలసి వచ్చింది. ఈ వివాదాల సందర్భంగా వీరేశలింగం కనపరచిన చాకచక్యమంతా ఏ అపరాధ పరిశోధక ప్రజ్ఞాపాటవానికో తగివుంది. ఆయన సాగించిన ఈ కలం పోరుతో వివేకవర్ధని పేరంటేనే అక్రమ ప్రవర్తనగల అధికారులకు, అవినీతిపరులకు గర్భనిర్భేదకమైపోయింది. ఆ తర్వాత కులమతాచారాలను జనుల నైతికవర్తనను చక్కదిద్దాలని పూనుకున్నాడు వీరేశలింగం. పీఠాధిపతుల లోటుపాట్లపై ధ్వజమెత్తాడు. వాళ్ళ కుక్షింభరత్వాన్ని ఆక్షేపించాడు. ప్రజలలో సదసద్వివేక జ్ఞానాన్ని వృద్ధిచేయక పోగా, అవినీతిని ప్రోత్సహిస్తూ, అధికార దుర్వినియోగం చెయ్యడం చెల్లదని తీవ్రంగా పురోహిత స్వాములపైనా, పీఠాధిపతులపైనా దండెత్తాడు వీరేశలింగం, ఈ విషయంలోనూ సత్ఫలితాలనే సాధించగలిగాడు.

ముక్కుపచ్చలారని పిల్లలకే పెళ్ళిళ్ళు చేయడం, కాలమో కర్మమో, ఆ అభాగినుల మాంగల్యం తెగిపోతే జీవితాంతం వాళ్ళను జీవచ్ఛవాలుగా జీవించా

ల్సిందేనని శాసించటం సహించలేక పోయాడు వీరేశలింగం. వృద్ధులకు వివాహాలు జరగటం, యుక్తవయస్సు రాకుండా బాలికలకు పెళ్ళిళ్ళు చేయవద్దనీ, మహిళలందరూ విద్యావంతులు కావాలనీ, ఆయన మొదటగానే ప్రబోధించాడు. జనాభా లెక్కలను చూసి హత భాగ్యురాండ్రైన ముద్దరాండ్ర ఆక్రందనలను లోకానికి చాటి చూపాడు. పద్దెనిమిదివందల ఎనభై ఒకటి జనాభా లెక్కల ప్రకారం దేశంలో పాతిక సంవత్సరాల వయసుకి మించకుండా విగత భర్తృకలై దయనీయ జీవితం గడుపుతున్నవారి సంఖ్య పన్నెండు లక్షలని వివేకవర్ధనిలో ప్రకటించాడు.

వీరేశలింగానికి ముప్పైరెండు ముప్పై మూడేళ్ళు వచ్చాయో లేదో, తెలుగు దేశంలో అత్యంత సాహసమైన, తీవ్రాతి తీవ్రమైన సాంఘిక సంస్కరణను సాధించాడు. విగత భర్తృకలకు పునర్వివాహాలు చేయడం ఆ సంస్కరణం. ఈ సంస్కరణను ఆచరణలో తేవడానికి ఆయన ఎన్నో కష్టనష్టాలు ఎదుర్కోవలసి వచ్చింది. బాధలు అనుభవించాల్సి వచ్చింది. మిత్రులెందరో అమిత్రులైనారు, శత్రువులెందరో తీవ్రశత్రువులై పగసాధించడానికికూడా పూనుకున్నారు. అయినా ఆయన జంకలేదు. ఆయన నిరంతరం తన జీవిత కాలమంతా ఇటు సాంఘిక సంస్కరణకు అటు సాహిత్య పురోగమనానికి తనను తాను అంకితం చేసుకున్నారు. అవకాశం వచ్చినప్పుడల్లా ఆంధ్రదేశమంతా పర్యటించి తన సిద్ధాంత ప్రచార ప్రబోధాలు గావిస్తూ వచ్చాడు.

వీరేశలింగం రాజమహేంద్రవరంలో నాలుగో తరగతి చదువుతూ ఉండగానే బందరునుంచి ఆత్మూరి లక్ష్మీనరసింహంగారనే ఆయన అక్కడికి ఉపాధ్యాయుడుగా వచ్చాడు. ఈ ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు ఆ రోజుల్లో బ్రహ్మసమాజాభిమాని. దక్షిణదేశంలో ముఖ్యంగా బ్రహ్మసమాజ ప్రచారకులూ, స్థాపకులూ కూడా తెలుగువారే కావడం విశేషం. వీరేశలింగానికి ఇరవై ఏళ్లు వచ్చీ రాకుండానే బ్రహ్మసమాజ సిద్ధాంతాలు ఆకర్షించాయి. ఆయన ఏకేశ్వర విశ్వాసిగా మారిపోయినాడు. విగ్రహారాధనపట్ల వైముఖ్యం కలిగింది. కేశవచంద్రసేన్ పుస్తకాలు చదవటంతో మత సిద్ధాంతాలపట్ల హేతువాదమూ, కర్మకాండ నిరసనమూ, భక్తివైపు మొగ్గు, పరమేశ్వరునిపట్ల సకలలోక పితృభావమూ, సకల మానవులపట్ల భ్రాతృభావమూ బలపడుతూ వచ్చాయి. స్త్రీలకు విద్యాస్వాతంత్ర్యాలు, సామాజిక వికాసకార్యకలాపాలలో స్త్రీలు కూడా పాల్గొనడం, పురుషునితోపాటు

సమాన గౌరవ ప్రతిపత్తి బ్రాహ్మసమాజికుల ఆదర్శాలు. కులభేదం పాటించక పోవడం, సర్వమత సమానత్వమూ కూడా బ్రాహ్మసమాజ సిద్ధాంతాలు. ఒకవైపున సాహిత్యకృషి, మరొకవైపున సంఘసంస్కరణ కృషిసాగిస్తూనే సందర్భం కుదిరి వచ్చినప్పుడల్లా వీరేశలింగం బ్రహ్మ సమాజాదర్శాలను సిద్ధాంతాలను ప్రచారం చేశాడు. కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయమనే సంస్కృత నాటకాన్ని తెలుగు చేయడంలోనూ, సత్యహరిశ్చంద్ర, ప్రహ్లాద అనే స్వతంత్ర నాటకాలలోనూ, బ్రాహ్మసమాజ భావాలు వీరేశలింగాన్ని ప్రేరేపించాయి. పరిశుద్ధ మతధర్మ ప్రకటీకరణం నా మనసులో ఎప్పుడూ ఉంటుంది కాబట్టి అందుకంత సందర్భం వచ్చినా ఆయా సన్నివేశాల ద్వారా పాత్రలద్వారా, ఆ అభిప్రాయాలు, భావాలు, సిద్ధాంతాలూ నేను ప్రకటిస్తాను అని స్వీయచరిత్రలో వీరేశలింగం చెప్పుకున్నాడు. ఈ విధంగా బ్రహ్మసమాజ సిద్ధాంతానుసారంగానే జీవితాన్ని సాగించినా, 1906 వ సంవత్సరం వరకూ ఆయన అనుష్ఠానిక సభ్యుడు కాలేకపోయినాడు. అనుష్ఠానిక సభ్యుడంటే బాహ్యచిహ్నాలను వేటినీ ధరించకపోవడం. బ్రాహ్మణకుల సూచకమైన జందేనికి అనుష్ఠానిక బ్రాహ్మ సమాజంలో తావులేదు. అందువల్ల 1906 లో యజ్ఞోప వీతాన్ని విసర్జించి వీరేశలింగం అనుష్ఠానిక బ్రాహ్మ సామాజికుడైనాడు. ఇందువల్ల సంఘసంస్కరణకు సుముఖులైన సంప్రదాయాభిమానులలో కూడా ఆయన పట్ల వైముఖ్యం కలిగింది. దానివలన ఆయన కొన్ని బాధలు అనుభవించాల్సి వచ్చింది.

అనుష్ఠానిక బ్రాహ్మసమాజ దీక్ష స్వీకరణలో వీరేశలింగానికి మార్గదర్శకుడైన వాడు దేశిరాజు పెదబాపయ్య. ఈయన అకలంక నీతినర్తనుడు. తాను పూనిన కార్యభారాన్ని తన తర్వాత వహించగలడని వీరేశలింగం ఈయన్ను గూర్చి ఆశపడ్డాడు. కాని పెదబాపయ్య ఇరవై ఆరేళ్ళ లేతవయసుననే పరమ పదించడం వీరేశలింగానికి చాలా దుఃఖకారకమైంది. ఇట్లానే బసవరాజు గవర్రాజు గారిపై కూడా వీరేశలింగం ఆశపెట్టుకున్నాడు. బసవరాజు గవర్రాజుగారు కూడా వీరేశలింగానికి అనుచరుడుగా ఎంతో సాయపడ్డాడు. ఈయన కూడా నలభై సంవత్సరాలన్నా నిండకముందే పరలోకగతులైనారు. ఇదేవిధంగా వత్తిరాజు మృత్యుంజయరావు కూడా వీరేశలింగం ఆశలు అడియాసలుచేసి చిన్నతనంలోనే లోకాంతరస్థులు కావడం జరిగింది. ఈ విధంగా వీరేశలింగం తన జీవితకాలంలో అత్యంతాప్తులైన మిత్రులను సహచరులను కోల్పోయాడు. ఆయన్ను కంటికి

రెప్పలా ప్రాణానికి ప్రాణంలా కాపాడిన ఇల్లాలు కూడా ఆయనకన్నా తొమ్మిది సంవత్సరాలు ముందే పరలోకగతురాలైంది. యాభై సంవత్సరాల కాలం 'నా ప్రాణానికి ప్రాణంగా ఉన్న నా అర్ధాంగలక్ష్మి రాజ్యలక్ష్మికి' నా స్వీయచరిత్రను అంకితం చేస్తున్నాను – అని ఇల్లాలిపై తమకుగల ప్రేమాభిమాన పూర్వకమైన గౌరవాన్ని ఆయన ప్రకటించుకున్నాడు. ఇల్లాలు పరమపదించిన తర్వాత తాము గడిపిన కాలాన్ని అసహాయదశగా ఆయన స్వీయ చరిత్రలో పేర్కొన్నారు. ఆయన జీవిత కాలంలో ఇల్లాలే సహకరించక పోయినట్లైతే ఇన్ని ఘనకార్యాలాయన సాధించగలిగి ఉండేవారు కారు. ఆమె దొడ్డ ఇల్లాలు. భర్త ఆదర్శాల సామంజస్యాన్ని హృదయ పూర్వకంగా ప్రోత్సాహపరచ గలిగింది.

వీరేశలింగం జీవించిన డెబ్భై సంవత్సరాల కాలం ఆధునికాంధ్రదేశ చరిత్రలో సాహిత్య చరిత్రలో ఒక ఉజ్జ్వలమైన ఘట్టం. ఎన్నో కీలకమైన ఆధునిక సంస్కరణలకు, సాహిత్యంలో నవీనమైన రూపరేఖలకు తన జీవితకాలంలో వీరేశలింగం పాటు పడ్డాడు. ఆయన సిద్ధార్థుడే అని చెప్పాలి. తానాశించిన సంస్కరణ ఫలితాలను ఆయన కళ్ళముందే చూడగలిగాడు.

'ఎక్కడ ఏ అక్రమము చూసినా నాది సహించి ఊరుకుండే స్వభావంకాదు. దానికి వెంటనే ప్రతిక్రియ జరిగేవరకూ నాకు మనశ్శాంతి ఉండేదికాదు' అనే భావాన్ని వీరేశలింగం స్వీయ చరిత్రలో ఆయా సన్నివేశాలను ప్రస్తావిస్తూ ఎన్నో మాట్లు వెల్లడించాడు. ఆయన జ్వలితచేతనుడన్నమాట. అలసట, భీతి, మోమోటం, సర్దుకొని పోవడం, ఆయన ఎన్నడూ ఎరగడు. ఆశయ సాధనలో రాజీమార్గం లేదు. అట్లా అని ఖండితవాది కాడు, ఫలితం సాధించడం విషయంలో సర్దుబాట్లకు లొంగేవాడు కాడన్నమాట ఈ వ్యక్తిత్వం ఆయనలో కౌమార దశనుంచిన్నీ ప్రస్ఫుటమవుతూనే వచ్చింది. స్కూలు తరగతులలో చదువుకుంటున్న రోజుల్లో ఆ హైస్కూలు ప్రధానోపాధ్యాయుడైన వైయాపురిమొదలియారు. పాఠాలు బోధించడంలో సమర్థుడు కాడని, వీరేశలింగానికి ఇంకా కొందరు విద్యార్థులకూ కూడా తోచింది.

ఆ ప్రధానోపాధ్యాయుణ్ణి బదిలీ చేయాలని స్కూలు పిల్లలు సమ్మె జరప వలసి వచ్చింది. ఆ సమ్మెకు వీరేశలింగం నాయకత్వం వహించాడు. పై అధికారులకు వినతిపత్రం తయారుచేసి స్కూలుపిల్లల చేవ్రాళ్లచేసి పంపించాడు వీరేశ

లింగం. ఆ ఉపాధ్యాయుణ్ణి అక్కడినుంచి బదిలీచేయడం జరిగింది. ఇట్లా అని వీరేశలింగం స్వైర ప్రవృత్తి కలవాడనుకోవ డానికి వీల్లేదు. పాఠశాల తరగతులలో సత్ప్రవర్తనకై ఇచ్చే బహుమానాలు ప్రతి సంవత్సరమూ వీరేశలింగమే పొందుతూ వచ్చాడు.

భాషా విషయంలోగాని సమాజ సంస్కరణాభిప్రాయ విషయంలో గాని వీరేశలింగం తన మతమే సర్వోత్కృష్టమని దానిని మాత్రమే పట్టుకొని కూచున్నవాడు కాడు. ఆయన మారుతున్న కాలంలో ప్రయాణించాడు. అయితే ఆయన ప్రజాస్వామ్యవాది. నలుగురికోసం, ప్రజా సామాన్యంకోసం పాటుపడినవాడు. ఒకప్పుడాయన ఆంధ్ర సాహిత్యపరిషత్తు వార్షిక సభకు అధ్యక్షత వహించి వ్యావహారిక భాషోద్యమం పట్ల తమ అయిష్టతను వ్యక్తంచేశారు. అయితే ఆయన రాసిన ప్రహసనాలన్నిటా వాడుక భాషను ప్రచురంచేశారు. ఆయన ఇంకా మూడు నెలలకు పరమపదిస్తారనగా వ్యావహారిక భాషోద్యమంలోని సామంజస్యం వీరేశలింగం పంతులుకు పూర్తిగా అవగతమైంది. వెంటనే ఆయన వ్యావహారిక భాషా వాదాన్ని సంపూర్ణంగా అంగీకరించారు. ఈ విషయాన్ని గిడుగు వారే ఈ విధంగా ప్రస్తావించారు. ''పంతులు గారికి ఎప్పుడు ఏది మంచిదని తోస్తుందో అప్పుడు అదే సమ్మతము. భాషావిషయంలో చూడండి. చిన్నయ్యసూరి మిత్రభేదము రచించినట్టు ప్రాచీనాంధ్ర కావ్యములలోని భాష అభ్యసించి విగ్రహము, సంధి రచించినారు. అప్పుడు అదే యుక్తమని ఆయనకు తోచినది. అది అయుక్తమని తోచిన తర్వాత అట్టి గ్రంథములు మరి ఆయన రచించలేదు. అట్టి అయుక్తమైన పని చేసినందుకు తమ్ముతాము నిందించుకొన్నట్టు స్వీయ చరిత్రము రెండో భాగములో వారు ప్రకటించినారు. చూడండి పుట 156. అందరికీ తెలిసేటట్టు సుపరిచితమైన భాషలో రచించడము ఉచితమని తోచినప్పుడు నాటకాలు, నవలలు, ప్రహసనములు మొదలయినవి ఆలాగున రచించినారు. పండితులు ఆక్షేపించినా పంతులుగారు లక్ష్యపెట్టలేదు, ఎన్నోసార్లు వ్యావహారిక భాషా ప్రయోజనమును గురించి వారితో నేను చర్చించినాను. అంతకంతకు నా ఉద్దేశము వారికి సమ్మతమైనది. తుట్టతుదకు 1919 వ సం॥ ఫిబ్రవరి నెల 28 వ తేదీని నా సలహా అంగీకరించి, ''వర్తమాన వ్యావహారికాంధ్రభాషా ప్రవర్తక సమాజము'' ఒకటి రాజమహేంద్రవరమునందే స్థాపించి దానికి వారే అధ్యక్షులయినారు. అప్పుడు వారు కవుల చరిత్రము రెండవ కూర్పు అచ్చువేయించుటకు గాను గ్రంథము సవరిస్తూ

ఉండిరి. ఈ పని పూర్తికాగానే వాడుక భాషలో గ్రంథ రచనకు పూనుకొంటా మని సభలో చెప్పినారు. అయితే మా దురదృష్టముచేత మరి మూడు మాసములకే పంతులుగారు కాలం చేసినారు' అని రామమూర్తి పంతులుగారు పండిత భిషక్కుల భాషాభేషజానికి ఉపోద్ఘాతం రాస్తూ ఈ విషయం రాశారు.

వీరేశలింగం జీవించిన డెబ్బై సంవత్సరాల కాలాన్ని, ఆనాటి సాంఘిక పరిస్థితులను పరిశీలించి చూస్తే, ఆయన కాలంతోపాటుగా ఎంతముందు చూపు ప్రదర్శించారో తెలుస్తుంది. సంఘంలోని అగ్రవర్గాలవారి సాంఘిక లోపాలను చక్కదిద్దడానికి మాత్రమే పూనుకోక, సముదాయికమైన సంక్షేమం కోసం ఆయన కృషి చేశాడు, శతాబ్దాలుగా అణగారిపోయిన వారి సామాజిక వికాసం కోసం కూడా ఆయన కృషి చేశాడు. తాను నడిపిన పాఠశాలల్లో దళిత జాతుల పిల్లలను చేర్చుకోవడమే గాక, వాళ్ళను తక్కిన వారందరితోపాటు సమానంగా చూడటమే కాక, వాళ్ళను ప్రోత్సహించే నిమిత్తం, ఉచితంగా వాళ్ళు చదువుకోవడానికి కూడా ఆయన అవకాశాలు కల్పించాడు. బాలబాలికల సహ విద్యావిధానాన్ని తెలుగు దేశంలో ప్రవేశపెట్టింది వీరేశలింగమేనని చెప్పాలి. చిన్నతనం నుంచే మగ పిల్లల మనస్సుల్లో మహిళలపట్ల గౌరవభావం నెలకొనడానికి సహ విద్యా విధానం చక్కని ప్రతిపాదిక కాగలదని ఆయన భావించాడు. మహిళల మనో వికాసం కోసం ప్రత్యేకించి సారస్వత సృష్టి చెయ్యడమే కాకుండా బాలికా పాఠశాలల స్థాపన విషయమై కూడా ఆయన కృషి చేశాడు. ఇక సంఘంలో వంచితలైన స్త్రీలకోసం ఆయన రక్షణశాలలు నిర్మించాడు, వాళ్ళు జీవనోపాధి సంపాదించు కొనే స్తోమత కలిగించడానికి వృత్తి విద్యా పాఠశాలలు నిర్వహించాడు.

ఆధునికాంధ్ర దేశచరిత్రలో సమాజ వికాస చరిత్రలో వీరేశలింగం చారిత్రక మహాపురుషుడు. 'ఆతడనేక యుద్ధముల నారితేరిన 'వీరపురుషుడు. ఒక వైపున సంఘ సంస్కరణ కార్యక్రమాలలో తల మునకలవుతూనే తెలుగుభాషా సాహిత్యాలను సుసంపన్న చేయడానికి శతాధిక గ్రంథ రచన చేశాడు. అనేక ఆధునిక ప్రక్రియలకాయన ఆద్య ప్రవర్తకుడు. వీరేశలింగం జీవయాత్రను నాలుగుమాటల్లో వర్ణించవలెనంటే స్వార్థ త్యాగము, సాహసము, ఉత్సాహము, దీక్షల సమాహారమే ఆయన వ్యక్తిత్వం, అని శ్రీ నండూరి బంగారయ్యగారు గొప్పగా అంచనా వేశాడు.

ఒకవైపున నిర్విరామంగా సంఘ సంస్కరణ కృషిని సాగిస్తూనే సాహిత్యంలో వీరేశలింగం ఎంతో నవ్య సృష్టిచేశాడు. ఆయన కాలానికి పద్యకావ్యం, విరళంగా యక్షగాన రచన, పురాణేతి వృత్తాలనే స్వీకరించి సమాన బంధురమైన వచన రచన మాత్రమే సాహిత్య ధోరణులుగా ఉండేవి. అప్పుడప్పుడే సంస్కృత రూపకాలను తెలుగు చేయడం, ఇంగ్లీషునాటకాలను తెలుగులోకి అనువదించడం మొదలైంది. అంతేకాని ఆధునిక దృక్పథంతో వ్యాసరచన, శాస్త్రీయ వాఙ్మయం, సృజనాత్మక సాహిత్య ప్రక్రియలైన నవల, కథ, ఆధునిక కావ్య ప్రక్రియలైన ఖండకావ్యం, బాలసాహిత్యం, మొదలైనవి తెలుగులో ఇంకా ప్రారంభం కాలేదు. వీటన్నిటిని తెలుగులో ప్రారంభించి తెలుగు భాషా సారస్వతాలలో నవ్యతను సంతరించాడు వీరేశలింగం.

వీరేశలింగం సమకాలికులలో ఆయనకన్నా గొప్ప కవులెందరో ఉన్నారు. గొప్ప పండితులున్నారు, వేత్తలున్నారు, విద్వాంసులున్నారు. బహుముఖ ప్రతిభావంతులున్నారు. అయినా వీరేశలింగం పుట్టి నూటముప్పై సంవత్సరాలు గడిచినా పరమపదించి అరవై సంవత్సరాలు గడిచిపోయినా తెలుగు వాళ్ళు వీరేశలింగాన్ని కృతజ్ఞతతో ప్రేమతో గౌరవంతో అభిమానంతో స్మరించుకొంటూ వున్నారు ఆయన సమకాలికులందరికన్నా మిన్నగా. ఎందుకంటే ఆయన బహుజన సుఖంకోసం, బహుజన హితం కోసం ఎన్నెన్నో మార్గాలు చూపి, తన జాతి జనులను ఉద్బోధించినవాడు. సమకాలీన పతనావస్థను సముద్ధరించినవాడు కనుక.

వీరేశలింగం సంఘ సంస్కర్తగానా, సారస్వత వేత్తగానా భావితరాల తెలుగు ప్రజల కృతజ్ఞతా పాత్రుడు అని కొందరు విద్వాంసులు వితర్కించారు. ఆయన రెండు విధాలా చాలా మహితాత్ముడు. ఆయన ఆశించిన మత నీతి కులాచార రాజ్యాంగ సాంఘిక జీవన సంస్కరణలన్నీ సాధించినా కూడా ఆయన ఉన్నతమైన మానవుడిగా తెలుగు దేశంలో చిరస్థాయిగా స్మృత్యర్హుడుగానే ఉంటాడు.

వీరేశలింగం కవుల చరిత్ర, రాజశేఖర చరిత్ర, సత్యరాజాపూర్వ దేశ యాత్రలు, ఈసప్ నీతికథలు, శాకుంతలాంధ్రీకరణం. గొప్ప సారస్వత విలువ గలిగిన రచనలు - అవి కలకాలం సాహితీపరులకు ప్రీతిపాత్రంగానే ఉంటాయి.

ఒక పరిణామ కాలంలో తెలుగు సాహిత్యాన్ని ఉజ్జ్వల స్థితికి తీసుకొని వచ్చిన మహా రచయిత వీరేశలింగం.

ఆయన వచన రచనలు సరళసుందరంగా వైశద్య స్ఫూర్తితో తేటతెల్లంగా ఉంటాయి, ఆయన గద్య తిక్కన అనే బిరుదుకు సర్వవిధాలా అర్హుడు. రాపిలోనే గాక వాపిలోకూడా తెలుగు నుడికారానికి తిక్కన కూర్చిన అందచందాలని ఆధునిక కాలాన వీరేశలింగం కూర్చాడు.

వీరేశలింగం సర్వరచనలనుంచి ఏర్చికూర్చిన, ఆయన వ్యక్తిత్వాన్ని, తాత్త్వీక దృక్పథాన్ని, విజ్ఞానాన్ని, భావసుభగత్వాన్ని వెలార్చగల కొన్ని సూక్తులు ఈ సంకలన గ్రంథంలో కనపడతాయి. విజ్ఞులా దరించగలరు. ఆలోచనలకు పదును పెట్టగలరు.

# 1. స్వీయ వ్యక్తిత్వావిష్కరణం

పనిచేసి చూపవలయునన్న చింతయేకాని ననుగూర్చి నేను చెప్పుకోవలయు నన్న యభిలాషము మొదటినుండియు నాకంతగా లేకుండెను.

— స్వీ. చ. మొ. భా. అవ.

ఓ భక్తవరదా! ఆత్మశ్లాఘా పరత్వమును నా మనస్సునుండి దూరము చేయుము. నా హృదయమునందు సదా సత్యమును వినయమును నెలకొలుపుము. భవత్ప్రీత్యర్థమయి పరమార్థ చింతతో దప్ప ప్రసిద్ధికయి నేనే పనిని జేయకుండు నట్లు నా చిత్తమును శాసింపుము.

— స్వీ. చ. మొ. భా. ప్రా.

స్వయోగ్యత లేకయే పూర్వుల గొప్పతనమును బట్టి తమకు గౌరవము కలుగవలయునని భావించెడు మనీషికోటిలోని వాడనుగాను.

— స్వీ. చ. మొ. భా. పు. 2

జ్యోతిశ్శాస్త్రములోని ముహూర్త జాతకభాగముల యందలి నమ్మకము నాకు చిరకాలము క్రిందటనే చెడినందున నేను స్వతంత్రుడనయిన తరువాత నా జన్మపత్రమును జూచుటకైనను నే నెన్నడును ప్రయత్నముచేసి యుండలేదు.

— స్వీ. చ. మొ. భా. పు. 5

నాకు పిన్న వయస్సునగల గ్రహణధారణశక్తి అసాధారణములయినవి.

— స్వీ. చ. మొ. భా. పు. 21

కడవరకును పాఠశాలలో నేను బహుమతి పొందని తరగతి లేదు.

— స్వీ. చ. మొ. భా. పు. 22

ఏక సంధాద్విసంధాగ్రాహులకుండు బుద్ధి విశేషము కొంత కలవాడనగుట చేత నే నింటినుండి పాఠశాలకు బోవుచు నొకసారియో రెండు సార్లో దారిలో

బాధమును జూచినంత మాత్రముననే నాకది ముఖస్థమయి యప్పటికి తప్పులులేక యప్పగింప శక్తుడనగుచుంటిని.

- స్వీ. చ. మొ. భా. పు. 23

ఏకరీతిని స్థిరముగా బాటుపడక సోమరిగా నుండు సూక్ష్మబుద్ధి కంటె నిరంతరము నేకరీతిని బాటుపడుచు, అనలసుడుగా నుండు మందబుద్ధియే లోకమునకును దనకును నెక్కువమేలును జేయగలవాడగును.

- స్వీ. చ. మొ భా. పు. 23

లోకమునకు మహోపకర్తలయి ప్రసిద్ధికెక్కిన మహాపురుషులందరును నిరంతర కర్మశూరులయిన సామాన్యధీశాలురుగాని కేవల ప్రతిభా మాత్ర మాన్యులయినవారు గారు. బుద్ధి సూక్ష్మత కుద్యోగశీలత తోడుపడిన పక్షమున నత్యధిక ప్రయోజకరము కావచ్చును.

- స్వీ. చ. మొ. భా. పు. 24

నా తల్లి కోపస్వభావమును స్వతంత్ర బుద్ధియు వాక్పారుష్యమును గలదయినను, దయార్ద్రహృదయమును పరోపకార చింతయు సత్యశీలతయు ధైర్యశాలిత్వమును పూనిన కార్యమునందలి స్థిరప్రవృత్తియు నామె కలంకారములుగా నుండెను.

- స్వీ. చ. మొ. భా. పు. 30

తల్లి గుణములు బిడ్డలకు వచ్చునని పెద్దలు చెప్పినమాట యసత్యము కాదు కదా. ఆమె గుణములలో కొన్ని నాకును బట్టుపడినవి.

- స్వీ. చ. మొ. భా. పు. 30

ప్రకృతిచేత నేనును కోపస్వభావముగలవాడనే. సాధారణముగా నేనెంత శాంతచిత్తుడనుగా గానబడినను నాకు కోప మతిశీఘ్రముగా వచ్చును.

- స్వీ. చ. మొ. భా. పు. 30

ఒరులు చెడుపని చేసినప్పుడు నాకు కోపమాగదు. నే నప్పుడు పరుషభాషణములు సహితము పలుకుదును.

- స్వీ. చ. మొ. భా. పు. 31

బాహ్యశత్రువులను వేవురనైనను నిరాయాసముగా జయింపవచ్చునుగాని యొక్క యంతశ్శత్రువును నిర్జించుట యతిప్రయాసముమీదగాని శక్యముకాదని బుద్ధిమంతు లనేకులు చెప్పియున్నారు.

– స్వీ. చ. మొ భా. పు. 31

ఎక్కడ నే యక్రమము కనబడినను నాది సహించి యూరకుండెడి స్వభావముకాదు. ఆ యక్రమమునకు ప్రతిక్రియను జూచువరకును నా మనస్సున కూరట కలుగదు.

– స్వీ. చ. మొ. భా. పు. 49

నా కొక యభిప్రాయము పుట్టుటకును దానిని నెరవేర్చబూనుటకును నడుమ తడవు విశేషముగా నుండదు.

– స్వీ. చ. మొ. భా. పు. 49

నాకెంతబాధ కలిగినను నే నోర్చుకొని యుండగలుగుదునుగాని యితరులకు నిష్కారణముగా బాధ కలిగినప్పుడు సహించి యుండజాలను.

– స్వీ. చ. మొ. భా. పు. 50

నేను సాధారణముగా శాంత స్వభావముగలవాడనే యయినను న్యాయ విషయమున నాగ్రహకారణము కలిగినప్పుడు' నా యుద్రేకమునకును పట్టుదలకును పరిమితి యుండదు. అప్పుడు నేను గురువనియు బంధువనియు స్నేహితుడనియు బలయుతుడనియు జూడక పూనిన కార్యమునందు దీక్ష వహించి కడవరకును పని చేయుదును.

– స్వీ. చ. మొ. భా. పు. 51

నా మాటలను వినునపుడు నా సహపాఠులకును సఖులకును గూడ వీరావేశము కలుగుచుండును.

– స్వీ. చ. మొ. భా. పు. 52

మతమునకు నీతి ప్రధానమనియు, నీతిమాలిన వాడు నిజమైన భగవద్భక్తుడు కాజాలడనియు, చిత్తశుద్ధిగలిగి యీశ్వరానుగ్రహమును బడయుటకు నీతి

పరుడై యుండుట యావశ్యకమనియు నేను మొదటి నుండియు నమ్మియుండిన వాడను.

- స్వీ. చ. మొ. భా. పు. 56

ఏదియైన వింతసంగతిని విన్నచో శోధించి దాని నిజమును గనుగొనవలె ననియు, విన్నదాని నెల్ల విశ్వసింప గూడదనియు, విశ్వసించిన దాని ననుసరించి ప్రవర్తింపవలెననియు, నాకు మొదటినుండియు నైసర్గికాభిరతియై యుండెను గాని యాలోచనలేక యొరులు చెప్పునట్లెల్లను నడుచు స్వభావమెప్పుడును లేదు.

- స్వీ. చ. మొ. భా. పు. 58

నీతికిని సత్యమునకును ధర్మమునకును భంగము కలుగని విషయములలో నెల్లను బహుజన వాక్యమును మాననీయముగా భావించి తదనుసారముగా పెద్దలకు లోబడి నడచుట కర్తవ్యము.

- స్వీ. చ. మొ. భా. పు. 60

సాధారణముగా బాల్యమునుండియు నాదిపట్టిన పట్టువిడుచు స్వభావముకాదు.

- స్వీ. చ. మొ. భా. పు 60

చిన్నప్పటినుండియు నాయూహలెప్పుడును శక్యాశక్య విచారము లేక యున్నత పదమునకయి పారుచుండెడివి.

- స్వీ. చ. మొ. భా. పు. 61

నా మనస్సైశ్వర్యాధికారముల నిమిత్త మెప్పుడును ప్రాకులాడు చుండెడిది కాదు.

- స్వీ. చ. మొ. భా. పు. 61

సాధారణముగా నాకు సంకల్ప ముదయించుటకును తదనుసారముగ కార్యారంభమున కుద్యమించుటకును చిరకాల మంతర ముండదు.

- స్వీ. చ. మొ. భా. పు. 61

దుర్నీతిపయిని నాకు సహజ ద్వేషము.

- స్వీ. చ. మొ. భా. పు. 62

నమ్మకములేని వానిని పామరుల సంతుష్టికై నమ్మినట్లు నటించి యాచరించుచుండుట సాధారణముగా నా స్వభావమునకు సరిపడదు.

– స్వీ. చ. మొ. భా. పు. 69

విశ్వాసము లేనిదానియందు విశ్వాసము లేనట్లు చెప్పుటయు ఆ విశ్వాస రాహిత్యమును మాటలచేతనేగాక చేష్టలయందును జూపుటయు నాకు స్వాభావికము.

– స్వీ. చ. మొ. భా. పు. 69

పత్రికా ప్రకటనము నందు నాయుద్దేశములు భాషాభివృద్ధియు దేశాభివృద్ధియు ముఖ్యముగా రెండు.

– స్వీ. చ. మొ. భా. పు. 79

మే మాకాలమునందు ప్రజాక్షేమము నిమిత్తమయి పనిచేయవలసి వచ్చినప్పుడు స్వజాతి వాడనియు బంధువనియు మిత్రుడనియు జూచెడివారము కాము.

ఈశ్వరబలము ముందరను సత్యబలము ముందరను మనుష్యబలమును ధనబలమును గవ్వకు కొరగావు. ఈశ్వర బలమున్న పక్షమున పూరిపుడకయు వజ్రాయుధ మగును; ఈశ్వరబలములేనిచో వజ్రాయుధము సహితము పూరిపుడక యగును.

– స్వీ. చ. మొ. భా. పు. 134

లోకములో సత్యమును ధర్మబలములే బలములుగావి యవిలేని యధికార బలమును విత్తబలమును బలములు కావు.

నేను మొదటినుండియు నధికారమునందును ధనార్జనమునందును విశేష కాంక్షగలవాడను గాను.

ఒకరు తానుపదేశించిన దాని ననుష్ఠించి చూపినంగాని కేవలశుష్కోపన్యాసముల వలనను పుస్తక ప్రకటనము వలనను కార్యముండదు.

తనకు ధర్మమయినపనిలో శక్తివంచన లేక కృషిచేయుట యొక్కటియే మనుష్యుని పని; దాని ఫలాఫలముల నియ్యవలసినవా డీశ్వరుడు గాన తద్విచారము మనుష్యునిదికాదు.

ఈశ్వర ప్రీతికరమయిన సత్కార్యమునందు యథాశక్తిని గృషిచేతను ఫలముగలుగకపోయిన పక్షమున మనుష్యుని లోపమేమియు లేదు. మనుష్యుడు చేయవలసిన పనిని జేసిన వాడగుటచేత నంతవరకే యతడు శ్లాఘనార్హుడు.

నా ప్రాణములకు సహితము కొందరు దుష్టులెగ్గుతలచిరి కాని విద్యార్థులును రక్షక భటులును నా కంగరక్షకులుగా నుండుట చేతను ప్రభువులకెల్లను ప్రభువయిన యీశ్వరుడే నన్ను కాపాడువాడయి యుండుటచేతను దుష్టుల వలన నాకే విధమైన యపాయమును గలుగలేదు.

- స్వీ. చ. మొ. భా. పు. 188

ఒక్కసారి నిశ్చయము చేసికొన్న తరువాత పట్టినపట్టును విడిచెడు స్వభావము కలవాడను కాను.

- స్వీ. చ. మొ. భా. పు. 201

ఆపదలు వచ్చినప్పుడు మేము ధైర్యముతో నిలుతుమో పిరికిపందలమై ధర్మపక్షమును విడిచి తొలగుదుమో శోధించుటకయి యీశ్వరుడు పంపిన శోధనలో యనునట్లుగా మమ్మన్ని ప్రక్కలను కష్టములే యెదుర్కొన నారంభించెను.

- స్వీ. చ. మొ. భా. పు. 202

మనుష్యమాత్రు లెవ్వరెంత మంది శత్రువులయి యెన్ని విఘాతములు చేయ బాటు పడినను మనము పూనిన కార్యము మంచిదియు నీశ్వరప్రీతికరమైనదియు నయిన పక్షమున ధర్మబలముచేత దైవబలముచేతను కడపట కార్య సాఫల్యము కాక మానదు.

- స్వీ. చ. మొ. భా. పు. 203

ఆ కాలమునందలి రాజకీయోద్యోగులలోని లంచములు మొదలైన యకృత్యములను నణచుటకును కులములోని దురాచారములను మాన్పుటకును సంఘ సంస్కారములను దేశమునందంతటను వ్యాపింపజేయుటకును మా చేతిలో వివేకవర్ధనీ పత్రిక యమూల్యాయుధముగా నుండెను

- స్వీ. చ. మొ. భా. పు. 211

నాకు హాస్యవచన రచనా నైపుణ్యమును ఈశ్వరు డధికముగా బ్రసాదించెను. స్వాభావికమైన యాశక్తిని నేనంతగా నుపయోగింపక గొంతవర కడచుచుందును.

- స్వీ. చ. మొ. భా. పు. 224

ఆ కాలమునందు విద్యార్థులు మాకు జేసిన సాయమును నేనెన్నటికిని మరువ జాలను. ఈ విద్యార్థులలో కొందరు లోకోపకారకార్యార్థమయి యగ్నిహోత్ర ములో దూకుమన్నను దూకుటకు వెనుతీయని వారుండిరి.

- స్వీ. చ. మొ. భా. పు. 253

అయిదవ వివాహమునకు వంట బ్రాహ్మణుడు లేచిపోగా నా భార్య యే గోదావరి నుండి నీళ్ళు మోచుకొని వచ్చి వంట మొదలైన పనులెల్లను స్వయముగా చేసి యెంతో కష్టపడవలసినదయ్యెను. ఈ కార్యములయందు నా వలెనే నా భార్యయు బద్ధాదరము కలదయి సర్వ కష్టములను సంతోష పూర్వకముగా సహించి నన్ననుసరించుచు సహ ధర్మచారిణి యన్న పేరన్వర్థము చేయుచుండెను.

- స్వీ. చ. మొ. భా. పు. 258

నా భార్య యొక్క యానుకూల్యమే లేక యుండిన యెడల నేనిన్ని కార్యములను నిరంతరాయముగా నిర్వహింపలేక యుందునేమో.

- స్వీ. చ. మొ. భా. పు. 258

నా దెప్పుడును పనిలేక యూరక కూరుచుండెడి స్వభావముకాదు.

- స్వీ. చ. మొ. భా. పు. 269

బాల్యము నుండియు నాది శీఘ్రకోపోద్రేకము నొందెడు స్వభావము. కార్యార్థమయి యొరుల వేడువారి కుండవలసిన యోర్పుగాని వారి ననుసరించి తిరుగ వలసిన యడకువగాని నా యొద్దలేదు. మొదటి నుండియు నేను శాసించుటకేకాని యాచించుట కలవాటుపడినవాడనుగాను.

- స్వీ. చ. మొ. భా. పు. 298

ఏ హేతువు చేతనో కాని యీశ్వరుడు నన్ను కార్యవాదినిగాగాక ఖడ్గవాది నిగా సృజియించియున్నాడు.

- స్వీ. చ. మొ. భా. పు. 298

నేను పాటుపడెడివాడను. ఇతరులు పాటుపడవలసినవారని తలచెడివాడను.

- స్వీ. చ. మొ. భా. పు. 311

న్యాయ విషయమున నాగ్రహకారణము కలిగినప్పుడు నా యుద్రేకమున కును పట్టుదలకును పరిమితియుండదు.

ఒక పని చేయవలెనని సంకల్పించుకొన్న తరువాత దాని నారంభించి ముగించువరకు నాకు నిద్రపట్టదు. కాల మమూల్యమైనది. నేడు వ్యర్థముగా పోగొట్ట బడిన కాలము రేపు కలసి రాదు.

కష్టపడి పనిచేయని వారికి ధనదానముచేసి సోమరితనము ప్రోత్సహించుట పాపమని నా మతము.

- స్వీ. చ. మొ. భా. పు. 311

నా దగ్గర నొక్క గొప్ప లోపము గూడగలదు. ఇతరు లడుగునది న్యాయ మైనది కాదని నేను భావించినప్పుడు నెమ్మదితో వారిని సమాధాన పరుపజాడక పెద్ద గొంతుకతో వారు దురాశాపరులనియు వారడిగినది యనుచితమైనదనియు నా మనసులో నున్న దానిని మొగమాటము లేక మొగము మీదనే స్పష్టముగా నని వేయుట.

- స్వీ. చ. మొ. భా. పు. 313

నాకు నెయ్యమునకంటె న్యాయము ప్రియతరమైనది.

- స్వీ. చ. మొ. భా. పు. 336

నేను ప్రకటించుచుండిన వివేకవర్ధని పత్రిక దుష్టవర్తనము గలవారందరి కిని గర్వ నిర్భేదకముగా నుండెను.

- స్వీ. చ. మొ. భా. పు. 336

ఆర్తుల దుఃఖనివారణ చేయు విషయమున సాధారణముగా నాది జాలి గుండెమే యయినను వారు దుర్నీతిపరులయినప్పుడు కఠినమయి దయమాలిన దగును.

- స్వీ. చ. మొ. భా. పు. 395

న్యాయ విషయమున మొగమాట పడక మిత్రుని మాటనైనను నేను నిరాక రించుచుండెడివాడను.

- స్వీ. చ. మొ. భా. పు. 399

ఎంత గొప్పవాఁడైనను మనుష్య ప్రయత్నముచేత భగవత్సమ్మతమయిన సత్కార్యము నశింపదని నాకు దృఢ విశ్వాసము.

- స్వీ. చ. రె. భా. పు. 114

ఒక పనిని సంకల్పించుకొనగానే దానిని నెరవేర్చువరకును నా మనస్సున కూరటయుండదు.

- స్వీ. చ. రెం. భా. పు. 130

ఇతరదేశములో నెన్ని సౌఖ్యములున్నను ఎంత గౌరవమున్నను మనసెప్పుడును స్వదేశము వంకను జన్మస్థలము వంకను జారుచుండును.

- స్వీ. చ. రెం. భా. పు. 134

ఏ విషయమునను నేనితరులు చూపిన దారినే పోవువాడనుగాక మనసు తిరిగినప్పుడు నా దారినే నేను నడచు వాడను.

- స్వీ. చ. రెం. భా. పు. 175

సంఘ దురాచార సంస్కరణమును పరిశుద్ధ మత ధర్మ ప్రకటీకరణమును నా మనస్సు నెప్పుడును బాయకుండునుగాన నేనే పుస్తకము జేసినను దానిలో నవకాశమున్న యెడల నేసందర్భమునైనను వాని నించుక చొప్పించుచుండును.

- స్వీ. చ. రెం. భా. పు. 194

ఈశ్వరుడు నాకు వేగముగా వ్రాసెడు శక్తిని ప్రసాదించియున్నాడు. పద్యమునుగాని వచనమునుగాని నే నొక్కసారియే వ్రాయుచుందును; వ్రాసిన దానిని మరల దిద్ది వ్రాయుట నాకలవాటు లేదు.

- స్వీ. చ. రెం. భా. పు. 263

తెలుగు భాషను వృద్ధి చేయవలెనన్నయభిలాషము నాకు మొదటి నుండియు విశేషముగా నుండెను. నేను నా కాలమంతయు భాషాభివృద్ధి నిమిత్తమేయుపయోగించి పాటుపడిన పక్షమున గొంతవరకు నాయభిలాషము నెరవేరియుండునేమో.

నే నొక్క పనితో దృప్తి నొందక యేకకాలమునందెన్నిపనులను పైని వేసికొని నిర్వహింప జూచుచుండెడి వాడనో మీకు విశదమయియుండును. ఇన్ని పనుల నొక్కసారిగా పైనివేసికొనుటచే నే నే పనిని తృప్తికరముగా నిర్వహించుటకు సమర్థుడను కాకపోతిని.

ఇట్లయ్యును నేను కొంచెములో కొంచెము నాయభిలాష సిద్ధిని బడసితినను కొనెదను.

తెలుగులో మొదటి వచన ప్రబంధమును నేనే చేసితిని. మొదటి నాటకమును నేనే తెనిగించితిని. మొదటి ప్రకృతి శాస్త్రము నేనే రచించితిని. మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని. మొదటి చరిత్రమును నేనే విరచించితిని. స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని.

స్వీ.చ. రెం.భా పు. 263, 264

నాకు నిజమైన విశ్రాంతి యెప్పుడును కలుగలేదు.

- స్వీ. చ. రెం. భా. పు. 267

ఎప్పుడును నేనేదో పనిచేయుచుండవలసిన వాడనే కాని భోగము ననుభవించుచు నూరక సుఖముగా కూరుచుండుట నా స్వభావము కాదు.

- స్వీ చ. రెం. భా. పు. 267

మనస్సున్న పక్షమున మార్గముండకపోదు.

- స్వీ. చ. రెం. భా. పు. 337

# 2. రాజ్యాంగ సంస్కారములు

బయలి రాజ్యాంగ విషయకములైన స్వాతంత్ర్యములు లక్ష లభించినను గృహమునందు దానికి భంజకములయిన దుర్మత దురాచార పిశాచములకు దాస్యము చేయవలసి యుండిన యెడల నేమి సౌఖ్యము కలుగబోవును?

- దే శీ.

ఇంత సంతోషదాయకములయిన సన్మత సత్కులాచార స్వాతంత్ర్యములను గలవాడై యున్నను ధన ప్రాణ రక్షణము చేయని నిరంకుశ దుష్ట ప్రభుత్వమునకు బయలి దాస్యము చేయుచుండవలసిన యెడల నేమి సుఖము కలుగును?

- దే శీ.

రాజ్యాంగ విషయమయిన స్వాతంత్ర్యముల తోడి పాటుగా జ్ఞాన నీతుల విషయమునను మత విషయమునను కులాచార విషయమునను కూడ నభివృద్ధి పొందుచుండుట యత్యంతావశ్యకము.

- దే శీ.

జాతి మత ద్వేష మూలములు గలిగి పెరుగుచున్న దురాచార వృక్షమును మూలచ్ఛేదము చేయుటకయి ప్రయత్నింపక రాజ్యాంగ విషయకములయిన లక్ష ప్రయత్నములు చేసినను వానివలన సంపూర్ణమయిన యైక్యమత్యమును నిష్పాక్షిక దృష్టియు గలుగనేరవు.

- దే శీ.

ఈ దేశములో నెప్పుడును రాజ్యాంగ విషయమున జనులకేవిధమయిన స్వాతంత్ర్యములును లేవు. అందుచేత జనులు పరిపాలన విషయమున దమకు గొన్ని స్వాతంత్ర్యము లుండు నన్నయంశమును గూడ గుర్తెరుగరు.

జనులందరును రాజ్యాంగ స్వాతంత్ర్య సంపాదన కార్యమునందు శ్రద్ధ వహింపవలయును. తమ కిట్టి స్వాతంత్ర్యములు గలవని తెలిసి యవి తమకుండక

పోవుటవలన గలుగుచున్న కష్టములు జనుల కెప్పు డనుభవమునకు వచ్చునోయప్పుడు వారు శ్రద్ధ వహించి యా స్వాతంత్ర్యములను బొందుటకయి యూరక లేక సర్వ విధముల బ్రయత్నింతురు.

— దే శీ.

మంచియాలోచన చెప్పి తిన్ననిదారిని నడిపింపగల నాయకులు లేక పోయిన యెడల, జనులు తమ స్వాతంత్ర్యముల నిమిత్తమయి కృషిచేయక యుపేక్ష చేయుదురు.

— దే శీ.

రాజ్యాంగ విషయమయిన జన స్వాతంత్ర్యములను జనులకు దెలిపి వారికి వానియం దభిరుచి పుట్టించి తత్సంపాదన నిమిత్తమై వారు కృషి చేయునట్లు చేయవలెను.

— దే శీ.

మన దేశమందలి జనులు తమ స్వాతంత్ర్యముల నెరిగి యడిగియనుభవింప లేని వారుగా నున్నందున, ఇప్పటి రాజకీయోద్యోగులు సర్వ స్వతంత్రులయి ప్రవర్తించుట సంభవించుచున్నది జనులు తమ స్వాతంత్ర్యమును బొందినపుడట్టి వారిప్పుడు జనుల యజ్ఞతను బట్టి వారిమీద చెల్లించుచున్న యధికారములో గొంత తగ్గు ననుటకు సందేహము లేదు.

— దే శీ.

ఇంటను బయటను గూడ హేయ దాస్యము నుండి విముక్తులమయి యుభయ స్వాతంత్ర్యములను బొందగలిగినప్పుడు గదా మనము నిష్కళంక సౌఖ్యము నొంది యవ్యాజానందము నొందగలుగుదుము.

— దే శీ.

నిజమైన దేశ క్షేమము నపేక్షించిన పక్షమున దేనిని నుపేక్షింపక సమస్త స్వాతంత్ర్యముల నిమిత్తమును సమానముగా కృషిచేయుడు. అప్పుడు దేశమును సౌఖ్యవంతముగాను సంతోషవంతముగాను నభ్యుదయవంతముగాను జేయ గలుగుదురు.

ఉద్యమములలో మాట లెక్కువగాను కార్యములు తక్కువగానుకావలసినవి కొన్ని, మాటలు తక్కువగాను కార్యము లెక్కువగాను కావలసినవి కొన్ని, రాజ్యాంగ సంస్కార ప్రయత్నమిందు మొదటి తరగతి లోనిది. సాంఘిక సంస్కార ప్రయత్నమిందు రెండవ తరగతి లోనిది.

సంఘ సంస్కారము మన చేతిలో నున్నది. రాజ్యాంగ సంస్కారము దొర తనము వారి చేతిలో నున్నది.

- దే శీ.

మన చేతిలో నుండి మనము చేయవలసినది నిర్భయముగా చేసినప్పుడు గదా మనము నిర్మలమనస్కులమనియు విశ్వాసపాత్రులమనియు లోకమునకు దేటపడును.

రాజ్యాంగ స్వాతంత్ర్య సంపాదనోత్సాహముచేత సంఘ సంస్కరణ ప్రయత్నము నుపేక్షింపకుండవలయునని మనవారిని వినయ పూర్వకముగా వేడు చున్నాను.

ఓ విద్యార్థికులారా! మన సంఘ స్థితి బాగుపడినంగాని ప్రభుత్వమువా రను గ్రహించెడు రాజ్యాంగ స్వాతంత్ర్య ఫలములను మనము నిర్విచారముగా ననుభ వింపజాలము.

- దే శీ.

శరీరమందలి సప్తాంగములను పరస్పరానుకూలముగా నెదుగక యొక కడుపో కాలో యెక్కువగా నెదిగినప్పుడు దానిని మహోదరశ్లీపదాది నామములతో నశుభదాయకమైన రోగ చిహ్నముగా నెట్లు భావింతుమో యట్లే ధార్మిక సాంఘి కాభివృద్ధి ప్రయత్నము నుపేక్షించి యొక్క రాజ్యాంగ స్వాతంత్ర్యాభివృద్ధిని గూర్చియే యుద్యమించుటయు సంపూర్ణ సుఖ సాధకము కాజాలదని భావింప వలయును.

- దే శీ.

మానవ దేహములోని కరచరణాది సమస్తావయవములును యథా ప్రమాణ ముగా పెరుగుటయే వృద్ధి కాని యొక్క తలయో కాలో యత్యధికముగా పెరుగుట వృద్ధికాక రోగమయినట్లే దేశ విషయములో గూడ జనులు నీతి మతకులా చారాద్ధు

లైన సమస్తాంగముల యందును సమానముగా నభ్యున్నతి నొందుటయే వృద్ధిగాని యితరాంగములకు భంగము కలుగునట్లుగా నొక్క రాజ్యాంగములయందేగాని యొక్క బుద్ధి ప్రచారమునందే గాని యుత్కర్షమునొందుట క్షేమకరమైన దేశాభి వృద్ధి కాదని నా యభిప్రాయము.

- దే శ్రీ.

రాజ్యాంగ విషయమున నెక్కడనో దూరమున నున్న పరిపాలకులను వారి శాసనములను దూషించుట కంటె సమీపము నుండి రాజశాసనములను నడుపు వారి దోషములను వెల్లడి చేయుట యధిక ప్రయోజనకరమని నా నమ్మకము.

దొరతనము వారికి చెల్లింపవలసిన నేల పన్నుల మొత్తమున కంటె నీరిచ్చెడు రాజ పురుషుల కియ్యవలసిన లంచముల మొత్తమెక్కువయినప్పుడు నేల పన్ను కొంచెము తగ్గింపబడిన మాత్రముననే కాపుల కేమి మేలిమి కలుగ బోవును ?

వ్యాజ్యపు మొత్తమున కంటె న్యాయాధిపతికి సమర్పింపవలసిన యుపాయనమే యధికమయినప్పుడు వాది యభియోగపత్రమునకు బెట్టవలసిన ముద్ర కాగితముల మూల్య పరిమితి తగ్గింపబడిన మాత్రముననే గెలుపొందియు నతడేమి లాభ మనుభవింపగలుగును ?

చేసిన యపరాధమున కయి శిక్షా స్మృతివిబట్టి కట్టవలసిన ధనదండనము కంటె దోషిని దండింపక విడుచుటకును నిర్దోషిని దండించుటకును దండవిధాయి స్వీకరించెడు ముడుపే యెక్కువయినప్పుడు దండశాసనముల యందు మంచి మార్పులు కలిగింపబడిన మాత్రముననే మానప్రాణ రక్షణము కలవారయి ప్రజ లెట్లు సుఖమనుభవింపగలుగుదురు ?

- దే శ్రీ.

రాజ్యాంగ విషయములయందు స్వాతంత్ర్యమును బొందుటకయి ప్రయత్నిం చుట యత్యంతావశ్యకమేయయినను కులాచారసంస్కరణాదికము నిమిత్తమయి పనిచేయక యొక్క రాజ్యాంగవిషయమునందు మాత్రమే పాటుపడుచుండుట దేశమునకు క్షేమము కాదని మేము భావించుచున్నాము.

- వి వే. 1883

మనవారిప్పుడు పరిపాలన విషయమయిన స్వాతంత్ర్యముల నిమిత్తమెట్లు పాటుపడుచున్నారో అట్లే కులాచారములలో కాలానుగుణములయినట్టియు సుఖాభివృద్ధి కరములయినట్టియు మార్పులను గలిగించుటకయి ప్రయాసపడవలెను.

- వి వే 1883

రాజ్యాంగ విషయకములైన స్వాతంత్ర్య విషయములో వాగ్యుద్ధమున మహాశూరులుగా నున్నవారు కులాచార విషయములయిన మార్పుల నిమిత్తమయిన పోరాటములో పిరికిబంటులుగా నుండుటకు కారణము లేకపోలేదు. మొదటి విషయములో దూరముగా నుండి గవర్నరు జనరల్‌గారినో, స్టేటు సెక్రెటరీగారినో, రాజ శాసనమునో పత్రికా మూలమున నాక్షేపించి కావలసినంత ధ్వని చేసి యేవిధమయిన కష్టములకును లోనుగాకయే జనులచే సులభముగా గట్టి వాడని పేరు పొందవచ్చును. రెండవ విషయమునందో జనులలో నున్న దురాచారములను వెల్లడి చేసి వారి యాగ్రహమునకును దూషణమునకును పాత్రులయి బహు విధములయిన కష్టములను పొందవలసి వచ్చును.

మన వారిప్పుడు పరిపాలన విషయమయిన స్వాతంత్ర్యముల నిమిత్తమెట్లు పాటుపడుచున్నారో, అట్లే కులాచారములలో కాలాను గుణములయినట్టియు సుఖాభివృద్ధికరములయినట్టియు మార్పులను కలిగించుటకయి ప్రయాసపడవలెను.

- వి వే. 1885

ఓ విద్యార్థికులారా! రాజ్యాంగ విషయమున కొన్ని స్వాతంత్ర్యములు వచ్చినంత మాత్రముచేత దేశమంతయు బాగుపడునని స్వప్నావస్థయందును తలపబోకుడు. ఇల్లు బాగుపడినగాని దేశము బాగుపడదు. కులాచారములందలి దోషములు పోయినగాని ఐకమత్యమురాదు. ఐకమత్యము వచ్చినగాని యే స్వాతంత్ర్యము వలనను జనులకు ప్రయోజనము కలుగదు.

- వి వే. 1887

రాజ్యాంగ విషయములలో నాకును మా తోటలో నున్న వారికిని తరచుగ వివాదములు జరుగుచువచ్చెను.

వారిప్పుడు విద్యార్థిదశలో నున్న వారు గనుక పరీక్షలో గృతార్థులయి స్వతంత్ర జీవనమును సంపాదించుకొనువరకైనను రాజ్యాంగ ప్రక్షోభములో

బ్రవేశింపక పాఠములయందే శ్రద్ధ వహించి యుండవలసినదని వారికి నేను హితోపదేశము చేసితిని.

- స్వీ. చ. రెం. భా. పు. 308

రాజ్యాంగ విషయములలో నాకాదరములేనట్టు భావింపవలదు. దేశాభివృద్ధి కనుకూలములగు సమస్త విషయములలోను నా కాదరముగలదు. నేను పదు నాలుగేండ్లు వివేక వర్ధనికి విలేఖకుడనుగా నుండి దానిలో రాజ్యాంగ విషయకము లైన వ్యాసములను వ్రాసితిని.

- స్వీ. చ. రెం. భా. పు. 309

మతాచార కులాచార సంస్కరణమునందు సంపూర్ణ దశను బొందువరకును రాజ్యాంగ సంబంధములయిన స్వాతంత్ర్యములను బొందుటకయి ప్రయత్నింప గూడదని నాయభిప్రాయమైనట్టు భ్రమింపబోకుడు.

- స్వీ. చ. రెం. భా. పు. 313

సమస్త విషయములయందును యుక్త రీతిని కృషి చేయుచుండవలసిన దనియే నా యభిప్రాయము.

ఒక్క రాజ్యాంగ విషయమైన స్వాతంత్ర్యములు మాత్రమే సర్వజాతిమత సామాన్యాపేక్షణీయములై యున్నవి. కాబట్టి యీ యొక్క విషయమునందు మాత్రమే హిందూ దేశములోని సకల జనులు సంఘీభవించి జాతిమత వర్ణభేదము లతో పనిలేకుండ నన్యోన్య క్షేమ సంపాదనము నిమిత్తమై ఐకమత్యముతో పాటు పడుట సాధ్యమగును; ఇది విచారించియే మనదేశమందలి విద్యాధికులైన బుద్ధి మంతు లనేకు లాలోచించి కృషి చేసి కడచిన నాలుగు సంవత్సరముల నుండియు దేశీయ మహాసభను స్థాపించి వ్యయ ప్రయాసముల బాటింపక సర్వజన క్షేమాభి వృద్ధుల నిమిత్తమయి పాటుపడుచున్నారు.

- దే శీ.

# 3. కులాచార సంస్కరణం - దురాచార నిరాకరణం

దేశాభివృద్ధి కలుగుటకు విద్యావిషయములో, మత విషయములో, వ్యవహార విషయములో, కులాచార విషయములో. నీతి విషయములో నానా ముఖముల పని చేయవలె.

మూర్ఖులెల్ల కాలము నాచారభూతమునకు దాసులయియే యుండజాలరుగాని తమకు క్షేమము కలిగెడి విషయములయందైన దాని దాస్యమునుండి విముక్తులగుటకు స్వప్నావస్థలయందును బ్రయత్నింపరు.

విద్యా విభూషితులగు మహానుభావులు వివేకదీపము చేతనైన జూడ నొల్లక కన్నులు మూసికొని పూర్వాచార మహాభూతమునకే సేవ చేయుచు వచ్చుచున్నంత వరకు మనదేశమునకు పుణ్యము కలుగదు.

- స్వీ. చ. మొ. భా. పు. 26

పండిత పామర భేదములేక మా వారెల్లరును నాచారమునకు దాసులు. ఆచార పిశాచమావేశించినచో వారికి దయయు ధర్మమును సత్యమును సత్కర్మమును సర్వమును పరిత్యాజ్యములు.

- స్వీ. చ. మొ. భా. పు. 26

దేశముయొక్క లాభమునకయి పూర్వాచారమునకు విరుద్ధముగానున్న పనికి పూనుకొన్న పక్షమున, తలపెట్టిన పని యెంత సర్వోత్తమమయిన దయినను దాని కించుమించుగా నందరును ప్రతి పక్షులుగానేయుందురు. ఎవ్వరో తెలిసిన వారు కొందరనుకూలముగా నున్నను వారు సహితము లోకమునకు వెరిచి పయికి రాకయే యుందురు.

పలువురు ప్రతిపక్షులుగా నున్నను జడియక దైవముఖమును జూచి పని చేయువారు మాత్రమే లోకోపకారమును జేయుట కర్హులు.

- వి వే 1881

మనదేశ మిప్పుడాచార పిశాచమునకు లోబడి పూర్వపు మహోన్నత దశను పోగొట్టుకొని సర్వవిధముల చేతను మిక్కిలి హీనదశయందున్నది.

- వి వే 1881

ఎంత మాత్రమును మార్పులేక సదాయేక రీతిగా నుండునవి తిర్యగ్జంతువులు మాత్రమే పశుపక్ష్యాదులవలె గాక యంతకంతకు జ్ఞానాభివృద్ధిని చెందుచు సుఖాధిక్యమును పొందుచుండుట మానుష ధర్మము

- వి వే 1881

దేశముయొక్క క్షేమ లాభములయందు దృష్టియుంచువాడు రోగి క్షేమము గోరి యాతని కప్పటికింపుగా నుండకపోయినను చేదుమందుల నిచ్చి యాతని నాశ్రయించియున్న వ్యాధులను పోగొట్టి దేహమున కారోగ్యదశను కలిగించు వైద్యునివలెనే చిరకాలమునుండి దేశము నాశ్రయించి బాధించుచున్న దురాచారములను వ్యాధులను హితోపదేశ రూపమయిన దివ్యౌషధముచే పోగొట్టుటకు సర్వవిధముల ప్రయత్నము చేయవలయును.

- వి వే 1881

కులాచార సంస్కరణాదికము నిమిత్తమయి పనిచేయక యొక్క రాజ్యాంగ విషయమునందు మాత్రమే పాటుపడుచుండుట దేశమునకు క్షేమకరము కాదు.

- వి వే 1883

తన కులము వారికిని ముఖ్యముగా తన కుటుంబము నందలి యనాథలైన నిర్భాగ్య కాంతలకును వారి స్వాతంత్ర్యముల నిచ్చి వారిని సుఖపెట్ట నేరక వారి నూరక కలకాలమును దుఃఖపెట్టుచుండెడివారు జన సామాన్యము యొక్క సుఖమున కెట్లు తోడుపడగలరు ః ఇంట గెలిచికదా రచ్చగెలువవలెను,

ముందుగా తమ గృహముల యందును తమ కులమునందును గల లోపములను నివారించుకొని వారికి సౌఖ్యానందములు కలుగజేసి గదా తరువాత

దేశముయొక్కయు జన సామాన్యము యొక్కయు సుఖాభివృద్ధి నిమిత్తమై పని చేయవలెను.

- వివే. 1885

కులాచార మతాచార విషయములైన మార్పుల కింకను సమయము రాలేదనియు, సమయము వచ్చినప్పుడా మార్పు లెవ్వరి ప్రయత్నము నక్కరలేక తమంతనే జరుగుననియు ఈ రెండు విషయములందును ప్రస్తుతమున్న యాచారములే మంచివి సుఖప్రదమయినవియు ననియు, క్రొత్త మార్పులకై ప్రయత్నించువారు దేశమున కనర్థము తెచ్చుచున్నారనియు, అందుచేత వారు నిందార్హులనియు కొందరు మహాపురుషులు ఘోషించుచున్నారు.

మూఢులయిన జనులు కూడ వీరితోజేరి కులాచార మతాచారములను సంస్కరింప గృషిచేసెడు వారిని బాధింప మొదలుపెట్టుచున్నారు.

- వివే. 1887

కులాచార మతాచారములను సంస్కరింప బూనుకొనెడి వారి యందారోపించెడు మొదటి దోషము వారా పనిని పూనుట కర్హులు కారనుట; పూనిన పని మంచిదయినప్పుడు పూనిన వారు తగినవారు కారనుట నిజమయిన యాక్షేపణకాదు.

నిజముగా వారర్హులు కారనియే తాము భావించెడి పక్షమున ఈయాక్షేపణలు చేయు మహాత్ములు తామాపనికి పూని నిర్వహించిన వారికంటె తామర్హతరులయినట్టు కార్యములచేత లోకమునకు జూపిన నెంతయు సముచితముగా నుండును.

- వివే. 1887

ఇప్పటి హీనదశను దానికి కారణములయిన దురాచారములను పోగొట్టుకొని పూర్వుల సదాచారముల నవలంబించి మరల మంచిదశకు రండని బోధించి కృషి చేయుటయే కదా కులాచార మతాచార సంస్కరణము నపేక్షించు వారి ప్రయత్నము.

తాము లోకోపకారము చేయక పోయినను చేయబూనిన వారిపయి లేనిపోని వంకలుపెట్టి నిరుత్సాహ పరుపక యూరకున్నను కొంత లోకోపకారముగా నుండును.

వివే. 1887

యెల్లవారును వివాహాదుల యందును కులాచారముల యందును వ్యర్థ దంభమునకై భూరి దక్షిణలు సంతర్పణములు మొదలైన వాని క్రింద ఋణము చేసి వ్యయము చేయక కలకాలదని జరుపుటకై ప్రయత్నింపవలెను.

- వివే 1887

కులాచార విషయమయి యుక్తమయిన మార్పులను జేసికొని యా విషయమున దమకుగల స్వాతంత్ర్యములను బొందుటకును స్త్రీలకుగల స్వాతంత్ర్యముల నిచ్చి వాని మూలమున సుఖించుటకును మనవారెంత మాత్రమును బ్రయత్నింపకున్నారు.

- వివే 1887

ఇంట సుఖములేక బాధపడుచున్నప్పుడు బయట మనకేమి సుఖము కలుగగలదు? మనస్తాపముచేత వేగుచున్న వానికి పయినెన్ని గంధములు పూసిన తాప శాంతి కలుగును?

కాబట్టి మనవారు ముందుగా నింటగెలిచి మరి రచ్చగెలుచుటకయి పాటు పడవలెను.

నీతి విషయముననను మత విషయముననను కులాచార విషయముననను మన కున్న లోపమే మన ప్రస్తుత హీనదశకెల్లను కారణమగుచున్నది.

పూర్వాచారములను మంచి వానిని చెడ్డవానిని కూడ సమానముగా కాపాడుటకయి మనలోని చదువుకొన్న వారిప్పుడు చేయు ప్రయత్నమే యీ యనర్థమును మరింత హెచ్చు చేయుచున్నది.

- వివే. 1887

బాల్య వివాహములవలననే మన వారంత కంత కాయుఃప్రమాణము తగ్గిన వారగుటయే కాక దేహబలౌన్నత్యాదులను గూడ పోగొట్టుకున్న వారయి క్రమక్రమముగా పురాణముల యందు వర్ణింపబడిన యంగుష్ఠ మాత్ర శరీరులగుటకు కూడ బ్రయత్నించుచున్నారు.

- వివే. 1887

మన దేశస్థితిని చక్కగా విచారించి యికనైనను ప్రతికా విలేఖకులు పెద్దలయిన వారు కేవల రాజకీయ విషయములను వ్రాయుటతో తృప్తినొంది

యుండక దేశాభివృద్ధి కావశ్యకములయిన కులాచారాదుల సంస్కరణములను గూర్చి తరుచుగా ముచ్చటింపు చుందురని నమ్ముచున్నాము

- వివే 1887

ప్రతి మతములోను శాఖలనేకము లేర్పడి పరస్పర వైరమునకును ద్వేషమునకును గారణములయినవని. ఒక్కయద్వైతమును పుచ్చుకొన్న పక్షమున స్మార్తులలో వైదికులనియు నియోగులనియు ప్రథమశాఖలనియు బహువిధములయిన భేదములు గలవారయి పరస్పర సంబంధ బాంధవ్యములను లేక యున్నారు.

ప్రతిమతము నందును మితిమీరిన శాఖోపశాఖ లేర్పడి తన్మతావలంబకుల కందువలన నే విధములైన లాభములు లేకపోయినను బహువిధములైన నష్టములు మాత్రము కలుగుచున్నవి. ఈ శాఖాభేదములకు దగినంత కారణములున్నవా యని విచారింపగా ఆ కారణములలో గొన్ని యితరులు విన్న నవ్వదగినవిగా నుండును.

ముఖమున బెట్టుకొను నామము నాసాగ్రమునుండి యుండవలెనని నియమ మేర్పరచుకొన్నచో ముక్కుయొక్క మొదలేది యని తగవులుపడి యొక రీచివర యనియు రెండవ వారా చివరయనియు వాదించి విడిపోయి పరస్పరబంధుత్వమును పంక్తి భోజనములను లేకుండ జేసికొని శాశ్వత ద్వేషములు వహించుట యేమి సరసముగా నుండునో బుద్ధిమంతులందరు నూహించుకోవచ్చును

- వివే. 1887

మనదేశము నందిప్పుడు ప్రబుద్ధ లనేకులు బయలుదేరి దురభిమానముచేత దేశము నందలి దురాచారములను మూఢవిశ్వాసములను గూడ సదాచారములుగాను వివేకిజన సమాదరణీయములుగాను పొగడి తన్మూలమున జనులలో మతోన్మాదమును దురాగ్రహమును వృద్ధిపరచుచు ఇతరదేశముల వారియందున్న గుణములను కూడ దోషములుగా ఘోషించి తామేమో మహాదేశాభి మానులయినట్లు నటించుచున్నారు.

- వివే. 1887

పూర్వుల సదాచారములను మాత్ర మనుసరించి దురాచారములను సంస్కరింపకొని దేశక్షేమకరములయిన నూతనాచారముల నవలంబించుచుండుట వలననే జనులెప్పుడును నభివృద్ధి పొందగలుగుదురు.

అట్లు చేయక తమ పూర్వులే సర్వజ్ఞులని గర్వపడుచు తమ పెద్దల దురాచారములను సహితము సదాచారములని యవిచారపూర్వకముగా నమ్మి యాచరించుచు పూర్వాచార విరుద్ధములన్న హేతువుచేత లాభకరములయిన నూతనాచారములను నిరాకరించుచు వత్తురేని జను లభివృద్ధిలేక యంతకంతకు చెడి కడపట వివేకుల దృష్టియందు పరిహాసాస్పదు లగుదురు.

- వివే 1898

మనదేశమునందిప్పుడు చదువుకొన్నవారు సహితము తాము చదువుకొన్న చదువును వివేకమును పదట గలిపి మూఢాచారములకు దాసులయి పామరులకు ప్రియముగా నుండుటకై వానిని పొగడుచుండుట యెంతయు శోచనీయముగా నున్నది.

ఈ పుణ్యపురుషులు ప్రపంచముయొక్క బాల్యదశలో తత్కాలానుగుణముగా నేర్పరుపబడిన ప్రతి మూఢాచారమును, స్వప్రయోజనపరులచే ధనాకర్షణార్థమై కల్పింపబడిన ప్రతి మూఢ వ్రతమును, అసూయా పిశాచావిష్టులచే సృష్టింపబడిన ప్రతిక్రూరకర్మమును కాపాడుటకై హేతుకల్పనములు చేయుటయందు తమ బుద్ధిని పురాణవిద్యను ధారవోయుచున్నారు.

- వివే. 1898

దేశాభిమానలేశముగల వారెవ్వరైనను దేశమునకు నష్టకరములైన క్రూరాచారములను సంస్కరించు ప్రయత్నమున కించుక పూనగానే యట్టి సంస్కారప్రియులకు కపటవర్తనులనియు నాస్తికులనియు దేశానర్ధదాయకులనియు దూషించుచు తమ పాండిత్యము నవ్యర్థముచేసికొని కృతార్థులగుచున్నారు.

- వివే. 1893

తామే కార్యమునుజేసినను పూర్వాచారమును మాత్రము తృప్తిపరచుటకై కాక యీశ్వరుని తృప్తిపరచుటకయి చూచుచుండునట్లు జనుల కుపదేశింపుడు.

- వివే. 1898

జనులు తామందరును నేకేశ్వరుని వలన సృజింపబడిన వారగుటచే నన్యోన్య సోదర భావముకలిగి మెలగవలెనని తెలిసికోక మానవ కోటిలో కొందరు మరికొందరిని పశువుల కంటెను నికృష్టులనుగా జూచి ద్వేషించుచున్నప్పుడు పయి

తరగతుల వారు కొందరు కొన్ని స్వాతంత్ర్యములను పొందిన మాత్రమున జన సామాన్యమునకు క్షేమసౌఖ్యములెట్లు కలుగును ?

బురదలో పొర్లివచ్చిన గేదె తమ్ము రాచుకొని పోయినను తాము మైలపడ లేదని భావించుకొనువారు తోడి మానవుడైన పంచముడు వీధిలో చేరువనుండి పోయినంతనె మైలసోకినదని తిట్టుచు తాము స్నానములు చేసి పావనులమైతి మను కొనుచున్నారు గదా ?

మనవారు మేమే లోకములో నుత్తమోత్తముల మనియు మాయాచారములే సర్వోత్కృష్టములనియు దుర్భ్రమను పొంది దురభిమానమును వహించి చెడిపోక మనలోని సదాచారములను కాపాడుకొనుటకును దురాచారములను త్యజించుటకును సర్వప్రయత్నములను చేయవలెను.

మతవిషయములైన కొన్నిదురాచారములను తొలగించుటలోను బాల్య వివాహములు మాన్పుటలోను మూఢవిశ్వాసములను పోగొట్టుటలోను వితంతు వివాహములను నెలకొల్పుటలోను, వివాహవ్యయములను తగ్గించుటలోను, క్రూరములైన వర్ణాచారములు రూపుమాపుటలోను సత్కార్యశూరతను మనవారు చూపవలసియున్నది.

ఇతరులకు త్రోవచూపి నడపవలసిన వారు విద్యాధికులు కాని మూఢులు కారు.

విద్యాధికులు మూఢులకు దారిచూప సాహసింపక తామే మూఢుల దారిని నడుచుచున్నంత కాలము దేశముయొక్క దౌర్భాగ్యము వదలదు.

- వివే. 1893

వేదములయందు బ్రాహ్మణాది వర్ణభేదమే లేదనియు తరువాత నైనను బ్రాహ్మణాది చాతుర్వర్ణ్య విభాగము దక్క వేరు భేదములేవియు గానబడవనియు, వేదవేదార్థములను తెలిసినవారు చెప్పుచున్నారు.

తరువాత క్రమముగా వర్ణభేదము లెక్కువయయి ప్రతి వర్ణములోను మితి మీరిన యనావశ్యకములైన శాఖలేర్పడి ఇప్పుడవి పరస్పర ద్వేషమునకు దేశము యొక్క క్షీణదశకును గారణము లగుచున్నవి.

- వివే. 1894

న్యాయసభలలో దినమునకు నూరు తప్పు సాక్ష్యములను బలుకుచున్నను మొగము నిండ దిట్టముగా విభూతి పెండెకట్లనొండె దుడ్డునామము నొండె ధరించుకొని తావళముల ద్రిప్పు వారిని భక్తజనాగ్రేసరులను గాను సద్గుణ గరిష్ఠులను గాను దలచుచున్నారు.

- ఉప.

కన్యాశుల్కము గొని చేసెడివివాహ మసుర వివాహమని ధర్మశాస్త్రములు పిలుచుట న్యాయమే.

డబ్బు పుచ్చుకొని పిల్లలను ముసలి వాండ్రకిచ్చి వారి గొంతులను కోయుచుండగా చూచి యానందించుచున్నారు.

తల్లిదండ్రులు లాశాపిశాచప్రేరితులయి తమ కన్న కూతురులను వారికి తాతలుగానో ముత్తాతలుగానో యుండదగిన వృద్ధవిగ్రహములకు వివాహ మిషమున బలి యిచ్చుచున్నారు.

ఇట్టి యసుర వివాహమువలన వధూవరులకు గలిగెడు నష్టములు చెప్పబూనుకొన్నచో లెక్కకు మిక్కిలిగా నున్నవి. వాని నన్నిటిని దెలిపికొని కులమువారట్టి యక్రమముల నివర్తి చేయుటకు బూనుకోని యెడల దొరతనము వారు సంబంధము కలుగజేసికొని కన్యనిచ్చి సొమ్ముపుచ్చుకొనువారు దండనార్హులగుదురని శాసనము పుట్టించుట సముచిత కార్యమని తలచుచున్నాము.

- వివే. 1880

స్వప్రయోజనపరులైన మన పూర్వులు కొందరు కొన్ని జాతులవారు విద్యాభ్యాసము చేయగూడదని విధించియున్నారు. చిరకాలమునుండి యాచారముగా వచ్చుచుండుటవలన పూర్వుల వాక్యమునందే మిక్కిలి విశ్వాసము కలవారయి జనులలో సహితము తాము చదువగూడదను నమ్మకము కలవారును చదువవచ్చునా కూడదా యను సంశయముచేత బాధింపబడు వారును పలువురున్నారు.

- వివే 1880

# 4. మతము - నీతి - ఆస్తిక్యము

దుర్మార్గ నివారణమునందు అసాధారణ శక్తి గలది మతముకంటె మఱి యొక్కటి కానరాదు.

- ఉప.

ఎల్లవారికిని తమ మత మత్యంతావశ్యకమైనది.

- ఉప.

మతమునకెల్లను ముఖ్యాధారమయినది సమస్త కళ్యాణగుణ పరిపూర్ణుడును సృష్టిస్థితిలయ కారణ భూతుడును నిత్యుడును నగు పరమేశ్వరు డొకడున్నాడను జ్ఞానము కలిగియుండుట; ఆ వెనుక శరీరమువలె గాక మరణానంతరమున గూడనుండి పుణ్యపాప ఫలముల ననుభవించెడి యాత్మ యొకటి మనలోనున్నదను జ్ఞానము కలిగియుండవలయును. ఈ రెండు విధములయిన జ్ఞానములును కలుగకపోయిన యెడల మతమువలన లేశము గాని ప్రయోజనము కలుగ నేరదు.

- ఉప.

ఇప్పుడు మతములనబడు వానిలో నెంత మాత్రమును మత సంబంధము లేని దురాచారములు కూడ పెక్కులు దూరియున్నవి.

- ఉప

మూఢభక్తిని వదిలి సత్యమయిన జ్ఞానమును సంపాదించుకొని సుఖించుట ముఖ్య కార్యము.

- ఉప.

మనుష్యునకు దేవుడున్నాడను జ్ఞానము కలిగియుండుట సహజగుణమనియు లేదనుకొనుట బలవంతముగా దెచ్చి పెట్టుకొన్న యస్వాభావిక వ్యాపారమనియు దేటపడుచున్నది.

- ఉప.

లోకములో నజ్ఞానులు మొదలుకొని సుజ్ఞానులవరకును అందరును స్వభావముచేతనే పుణ్య పాపముల ఫలములను ముందెప్పుడో పొందుదుమనుజ్ఞానము కలిగియుండుటయు, దానిని బట్టియే లోకములో సర్వకార్యములును చక్కగా ప్రవర్తిల్లుచుండుటయు ఆత్మ దేహముతో నశింపక స్థిరముగానుండు ననుటకొక నిదర్శనముగా నున్నది.

- ఉప.

ఈ లోకములో మనుష్యులకు సుఖదుఃఖములు రెండును గలిగియుండుట వాస్తవమేకాని సుఖ మత్యధికమయినదిగాను దుఃఖము బహు స్వల్పముగాను నున్నది.

మనకు సుఖము కలుగుట సహజము దుఃఖము ఆగంతుకము.

- ఉప.

జ్ఞానము సంపాదించినకొలదిని ఆనందమును సుఖమును ఎక్కువగుచున్నవి.

నీతి గలిగి ప్రవర్తించుటవలనను భగవంతుని విషయమయి తెలిసికొన ప్రయత్నించుటవలనను ఇతర సత్కార్యముల వలనను మన సౌఖ్యము వృద్ధియగుచున్నది.

- ఉప.

సుజనులపయి ప్రేమ బూనుటకుగాని దుర్జనుల మీద ద్వేషము వహించుటకు గాని వారి వారి సుగుణ దుర్గుణములు తప్ప వేఱు కారణములేదు. అయినను లోకములో నెంతటి గొప్పవారుకాని దుర్గుణములు బొత్తిగా లేకుండ కేవల సద్గుణములనే కలవారులేరు.

- ఉప.

భగవంతుడు మన యిహలోక జన్మమునకు మాత్రమేకాక పరలోక జీవనమునకును గారణుడగుచున్నాడు. రాజువలె మనలను ఇక్కడ కాపాడుటకును హేతుభూతుడయి పరలోకమున కూడ మనకు రక్షకుడగుచున్నాడు; న్యాయాధిపతివలె మనము చేయు కార్యములను కనుగొని మన సుఖదుఃఖాదుల గలుగజేయ కర్తయగుచున్నాడు.

- ఉప.

భగవంతుడు మనము కోరిన కోరికలనన్నిటిని ప్రసాదింపకపోయినను మనము చేసిన తప్పులనన్నిటిని మన్నింపక పోయినను భగవద్ధ్యానమువలన మన మనస్సులకొక విధమయిన యానందము కలుగుటయేకాక సత్కార్యముల యందు ప్రోత్సాహమును దుష్కార్యముల యందు నిరుత్సాహమును కలుగును.

- ఉప.

భగవంతునిచే వ్రాయబడిన శాసన మొక్కటి ప్రతి మనుష్యుని హృదయము నందును ఉన్నదని చిత్త చాంచల్యములేని యెల్లవారికిని అనుభవమువలన చక్కగా దెలిసియున్నది.

ఒక శాసనమును జేసినవారు ఆ శాసనమునకు వ్యతిరిక్తముగా బ్రవర్తించిన వారిని శిక్షింపకపోయిన యెడల శాసనమువలన ప్రయోజనమేదియు నుండదు.

- ఉప.

సదా ఈశ్వరుని మనసునందు నిలుపుకొని ఆయన యాజ్ఞలను జ్ఞప్తియం దుంచుకొని లేశమును ప్రమాదమును బొందక జాగరూకులమయి, నీతి మార్గమున ప్రవర్తించుచు, ఈశ్వరానుగ్రహమునకు పాత్రులమయి శాశ్వత సుఖమును బొందుటకు ప్రయత్నింతము.

- ఉప.

దేహమును నిష్కారణముగా శుష్కింపజేసి శ్రమపెట్టినంత మాత్రము చేత నెప్పుడును పరలోక సౌఖ్యము కలుగునన్న మాటను నమ్మరాదు. ప్రవర్తనము తిన్నగా లేకపోయిన యెడల వేయి యుపవాసములు చేసినను లక్ష వ్రతములు సలిపినను కోటి తీర్థయాత్రలు సేవించినను పుణ్యలోకములు కలుగనేరవు; యుక్త ప్రవర్తనము కలిగియున్న పక్షమున పైని చెప్పిన వానిలో నొక్కటియు లేకయే పుణ్యలోకములు లభించును.

- ఉప.

లోకములోని సర్వవ్యాపారముల యందు నీతి యత్యంతావశ్యకము. నీతి లేనివారి యెడ నందరకును అవిశ్వాసము కలుగును.

నీతియే యిహపరసాధకము. ఎల్లవారును నీతిమంతులుగా నుండవలయు

ననియే భగవదుద్దేశము కాబట్టి నీతిగలవాడే యీశ్వరానుగ్రహమునకు పాత్రుడయి యుభయ లోకములందును సౌఖ్యముల ననుభవించును.

- ఉప.

యావజ్జీవమును నీతి విడువక వర్తించువాడొక్కడే లోకములో నిక్కమయిన సౌఖ్యము ననుభవించును తక్కిన వారందరును పయికి సుఖపడుచున్న వారివలె గానిపించుచున్నను మనసులోపల నిశ్చల సౌఖ్యము ననుభవించు వారు మాత్రము కారు

- ఉప.

నీతి మార్గమున స్థిరముగా ప్రవర్తింపవలయునని ఇతరులయెడ కఠినముగా నడువగూడదు. శాంతతతోను క్షమతోను గూడియున్నప్పుడే నీతి మిక్కిలి ప్రకాశించును. నీతిలేని క్షమాదులు మాత్రమెందునకు కొరగావు.

- ఉప.

యుక్తాయుక్తముల నెరిగి సన్మార్గ ప్రవర్తనమును నేర్చుకొనుట భగవంతుని విషయమయి యథార్థ జ్ఞానమును సంపాదించి పరలోక సాధనమును జూచుకొనుట విద్యవలన సంపాదించవలసిన లాభములు.

- వివే. 1880

తన మనస్సాక్షి దేనిని దోషమూలమనియు దుర్మార్గమనియు బోధించునో దానిని జనులు లక్షమంది యవలంబించియున్నను విడిచిపెట్ట వలయును.

మనము పడ్డ ప్రయాసమునకు న్యాయైక స్వరూపుడగు భగవంతుడు తగిన ఫలమును దయచేయకపోడు.

మన మనస్సాక్షి చెప్పునది యంతయు భగవంతుని యాజ్ఞా స్వరూపమనుటకు లేశముగాని సందేహములేదు.

- వివే. 1880

చదువుకోని మూఢులకును పరీక్షలగృతార్థులయి విద్యావంతులని పేరొందుచున్న వారికిని నీతి విషయమున నిప్పుడంతగా భేదము గనపడుచుండలేదు

- వివే. 1881

ఒకనిని నీతి మార్గమును మీరి చరింపకుండునట్లు పదిల పరచునవి పాప భీతియు నీశ్వరానుగ్రహ సంపాదనేచ్ఛయు. కాబట్టి మొట్టమొదట నెల్లవారికిని నిత్యత్వాది కళ్యాణ గుణపరిపూర్ణుడయిన ఈశ్వరుడొక్కడున్నాడనియు మనము యుక్తముగా ప్రవర్తించిన యెడల పరలోకమున మన యాత్మలకు శాశ్వతానందము దుర్మార్గమున సంచరించిన యెడల దుఃఖమును కలుగుననియు విశ్వాసమును పుట్టింపవలయును. అట్టి నమ్మకము లేనియెడల సదా సన్మార్గముననే ప్రవర్తించుట యెవ్వరికిని సాధ్యము కాదు

- వివే 1881

మతమునువిడిచి నీతియు నీతినివిడిచి మతమును నెప్పుడును వెలయనేరవు.

మత విషయములందు జనులందరు భిన్నాభిప్రాయముగలవారుగా నుందురనియు మతమును బోధింప బూనినచో కలహములకును జనులకు దురభిప్రాయము కలుగుటకును కారణమగుననియు, అందుచేత మత పుస్తకములను దొరతనమువారు పాఠశాలలయందు నేర్పింప బూనుకోకపోవుటయే యుచితమనియు కొందరందురు

సర్వమత సారములైన పారమార్థిక సత్యములను బోధించిన నెవ్వరికిని వైషమ్యము కలుగదు.

ముఖ్యములయిన విషయములలో నెల్ల మతములును సాధారణముగా నేకీభావము చెందియే యుండును.

సత్యము, శమము, కరుణ, ఆర్జవము మొదలయినవి పుణ్యకార్యములనియు అసత్యము, ఆగ్రహము, హింస, కౌటిల్యము మొదలయినవి పాప కార్యములనియు గూడ నన్ని మతములును రెండవమాట లేకుండ నొప్పుకొనుచున్నవి.

- వివే 881

లోకములో నిజమయిన సౌఖ్యమును పొందగోరు వారందరును ముందుగా సుజ్ఞానము నలవరించుకొన ప్రయత్న పడవలయును.

సుజ్ఞాన మున్నందుకు ఫలము సుచరితమును కలిగియుండుటయే.

ప్రవర్తనము తిన్నగా లేకపోవునేని జ్ఞానమెంత కలిగియున్నను అది యంతయు బూడిదలో బోసిన పన్నీరే యగును.

మనుష్యుడు సంపాదింపవలసిన జ్ఞాన మెప్పుడును క్రమమయినదిగా నుండ వలెను. దుర్జ్ఞానము కలిగియుండుట కంటె నజ్ఞానమే చాల మేలయినది.

- వివే. 1881

దేవుడొక్కడే యనియు పలుదైవములుండుట యసంగతమనియు జనుల కెప్పుడు దృఢముగా తోచునో యప్పుడే వైష్ణవులమనియు శాక్తేయులమనియు జెప్పుకొని పరస్పరాధిక్యమునకయి పోరాడి యొకరి నొకరు దూషించుకొనుచుండు క్రూరకృత్యము నశించును.

- వివే 1881

విద్యగలవాని నవశ్యముగా గౌరవింపవలసినదేగాని నీతికంటెను చదువును గొప్పగాచూచుట మాత్రము తగదు.

ఒకనికి విద్యలేకపోయినను హానిలేదుగాని నీతిలేకపోయిన పక్షమున వాడి హాపరదూరుడగును.

భగవంతుని నెరిగి భజించుటకును యుక్తాయుక్త వివేకముగలిగి తిన్నగా నడుచుటకును విద్య సాహాయ్యపడును గనుక అందు నిమిత్తమయి విద్య యాదరింప బడవలసినదేగాని ఆ రెండు కార్యములకు నుపయోగపడక మీదుమిక్కిలి వానికి భంగము కలిగించునప్పుడది యెంత మాత్రమును గౌరవింపబడదగినదికాదు.

- వివే. 1881

మన దేశములో నిప్పుడు నీతి యన్నమాట చచ్చిపోయి జాతికట్టుపాట్లు మాత్రము సర్వోత్కృష్ట ధర్మములుగా నేర్పడియున్నవి.

స్వప్రయోజన పరులైన కులపు పెద్దలచే నడుపబడుచున్నంత వరకు దేశమున నీతి వర్ధిల్లనేరదు.

- వివే. 1881

నీతిపరులు కాదలచి భగవంతునికి భయపడువారు మనలోపల నంతరాత్మ రూపమున నుండి బోధించు భగవద్వాక్యములను శ్రద్ధతో విని తదను సారముగా నడచుకొనవలయును

అంతరాత్మయొక్క బోధనలక్ష్యముచేసి గురువుల మాటలనే నమ్ముకొన్న పక్షమున వారు స్వప్రయోజనపరులయి తమకు ధనమిచ్చుచు తాము ధర్మమని

చెప్పినదాని ననుసరించిననేకాని మోక్షము లేదని నమ్మలికి నీతి మార్గమునకు వేరుగా వేరు మార్గమును చూపకపోరు.

- వివే 1881

మతావేశము చేతను మూర్ఖతచేతను కక్ష ప్రధానముచేసికొని వివేకము వదలి పోరాడునప్పుడు యుక్తాయుక్త విచారమును న్యాయదృష్టియు నెక్కడ నుండును.

మత వైషమ్యమును మూర్ఖతను సాధ్యమయినంతవరకు జనసామాన్యము నందు రూపుమాపుటకు ప్రయత్నింపవలయును.

- వివే 1882

ఏనాడును ఏ దేశములోను మంచికి మార్పులు వైదిక వృత్తివలన జీవనము చేయు వారి వలనగాని మతగురువులవలనగాని జరిగినట్లు చరిత్రము లెంత మాత్రమును చెప్పవు. వారెన్నటికిని కాలముతో వచ్చువారు కారు.

- వివే. 1882

సన్మార్గ ప్రవర్తనమును మొట్టమొదట తన యొద్దనుండియే యారంభింప వలయును ఒకవేళ లోకములో మరియెవ్వరిని బాగుచేయలేక పోయినను తన్నొక్కని నైనను బాగుచేసికొనిన వాడగును.

- వివే 1883

ఈ కాలమునందలి మతాచార్యులు పూర్వపు వారివలెగాక ధనాకర్షణ పరాయణులయి యుండుటవలన జనులకు వారి యెడగల గౌరవము నానాటికి తగ్గి పోవుచున్నది.

ఇప్పటి పాఠశాలలలో జెప్పెడి హూణవిద్యవలన మన పూర్వపుస్తకముల యందలి లోపములు వెల్లడియయి శాస్త్రాదుల యందలి విశ్వాసము తగ్గిపోయినది, అందుచేత నింగ్లీషు చదువుకొన్నడి ఇప్పటివారిని నీతిమార్గమునుండి తొలగకుండ బంధించు పాశములు వదులయియున్నవి.

పూర్వపు కట్టుపాటులయందు నమ్మకము చెడుచున్నప్పుడు వారిని నీతిమార్గమును తప్పి నడవకుండ జేయుటకయి దృఢతరమయిన బంధములేవియైన నుండ వలెను,

- వివే 1886

# 5. లోకరీతి

లోకములో ప్రతిపురుషుడును దనపక్షమే వాస్తవము కావలెనని కోరు చుండుంగాని దాను సత్యమయిన పక్షముననే యుండవలెనని కోరడు.

- వివే. 1874

కొందరు తమ్ము పండితులని యెవ్వరైన నొక విషయము నడుగవచ్చిరేని లేశమును సందేహింపక తమకు తెలియని దానసైనను తెలియదని చెప్పక, అన్నియుం దమకే తెలియునని యావేశకేదో యొకటి చెప్పి వారిని మోసముచేసి తమ ప్రయోజకత్వమునకు తమరే సంతసింతురు.

- వివే. 1874

పండితులలో చెడ్డవారుండిరా, లోకమునకు వారిలో నొక్కనివలన గలుగు హానియే పామరులు వేయిమందిచేయు హానికంటె నెక్కుడుగా నుండును.

- వివే. 1875

ఒక్క మంచికార్యము చేయబూనిన ప్రతిబంధములు వేయిచూపట్టును.

- వివే. 1875

సామాన్యముగా స్వల్పలాభము నిమిత్తము కల్లలాడు వారు తమ కప్పుడు కలుగునట్టు కానబడు కొలదిమేలునే చూచుకొందురుగాని దాని వలన ముందు రాబోవు ఘోర నష్టములను లేశముగాని యాలోచించుకోరు.

- వి వే. 1875

ఆరంభదశలో కార్యమెంతమంచిదయినను అందరు చేరుదురనుటకల్ల.

పూనిక యొక్కటి కలిగి పనిచేసిన పక్షమున నెటువంటి దుష్కార్యమును సులభముగా సాధ్యమగును.

లోకములో నేదికాని యారంభములోనే పెద్దదిగా నున్నదిలేదు. వస్తు విషయమెట్లో పనుల విషయమునట్లే మొదట కొంచెముగా నారంభమయి క్రమ క్రమముగా పెరిగి కడపట మహత్తరమైన దగును.

లోకోపకార పరాయణులగువారు తామందరి కొరకును కనిపెట్టి యుండక తాము సత్యమని లోకోపకారమని రూఢిగా నమ్మిన దానిని మొట్టమొదట తామాచ రించుచు తరువాత లోకుల నాచరింప జేయుటకు ప్రయత్నింపవలయును.

- వివే. 1888

సూదంటురాయి యినుము నాకర్షించినట్లే సత్కార్యమందరిని కాలక్రమ మున తన ప్రక్కకా కర్షించును.

- వివే. 1888

నే నధికారము గలవాడను ధనముగల వాడను అయిన పక్షమున లోకము న-తను బాగుచేయుదునని భ్రమపడి యెప్పుడును వాని నిమిత్తమయి మాత్రమే ప్రయత్నము చేయుచు తుదకు తమ జీవిత కాలములో నేమియు జేయజాలక యపాత్రపు చావు చచ్చిన వారినెందరినో మనము చూచుచున్నాము.

- వివే. 1888

ధనాధికారాదులెన్నియో యకార్యముల కొడిగట్టినం గావి సాధారణముగా లభించునవి కావు. ముందు మేలుచేయు సాధనములుగా నుండు నన్నవిర్మలాంతః కరణముతోనే యొకవేళ నపస్తోపాయముల చేతను ధనార్జనాదులు చేయగలిగినను కొంత కాలమొక కానిపని కలవాటు పడినచో దానిని మార్చుకొనుట యసాధ్య మగును.

ధన సంపాదనాదులు చేసినవారవి చేకూరిన తరువాత లోకోపకార చింత చింతయను మాటయే మరిచిపోయి సమస్త పరమార్థములను తమ యధికారాదు లేయనుకొని ప్రపంచముతో వేరుపడి తమ ప్రాభవము కొరకెల్ల కాలమును పరు లను బాధించుచు పాడగుచున్నారు.

వివే. 1888

ఎల్లవారును సాధారణముగా తమకు ప్రయాసము లేకుండ పేరు వచ్చెడి పనికే పనిచేయుదురు కాని కష్ట సాధ్యమైన పనికి సాహసింపరు.

- వివే. 1884

నిజమయిన గొప్ప తనమెప్పుడును వేష భాషలక్కరలేకయే యందరకును దెలియదగినదయి యుండును గదా.

- బస.

లోకములో పాండిత్య ప్రభావముగల వారనేకులున్నారు. బుద్ధికుశలతగల వారనేకులున్నారు. ఇతర శక్తి విశేషములుగలవారనేకు లున్నారు. కాని నీతి తప్పని వారెక్కడనో కాని కానరారు.

- బస.

లోకములోని విద్యాభివృద్ధికిని పాటునకును సత్కార్యాచరణమునకును చాల వరకు బాధయే కారణమని చెప్పినను చెప్పవచ్చును.

మనోవేదనను తప్పించుకొనుట కొరకే పాపమునకు భయపడి పుణ్యకార్యములు చేయ బ్రయత్నించుచున్నాము.

కష్టములను పొందినవారే సుఖము నధికముగా ననుభవింప గలుగుచున్నారు. కష్టములులేక సదా సుఖమునే పొందువారు సుఖము యొక్క విలువను దెలిసికొన లేక పోవుటచే వారికి సుఖమును సంతోషజనకమును తృప్తిదాయకమును గాకున్నది.

లోకములో కష్టములు వచ్చినవారికే నిజమయిన దైవభక్తియు పరోపకార చింతయు గలుగుచున్నవి.

- బస.

జీవితకాలము యొక్క దీర్ఘత్వమును నిర్ధారణము చేయుట మనుష్యుని యొక్క యుపకార చింతను సత్ప్రవర్తనమును బట్టి యయి యుండవలెనుగాని యేండ్లయొక్క సంఖ్యనుబట్టి యయి యుండగూడదు.

- మాళ.

నిరర్థకజీవుడయి వేయేండ్లు బ్రతికినవాని కంటె పుణ్యశీలుడయి యొక్క దినము జీవించిన వాడే చిరకాల జీవియని చెప్పవచ్చును.

- మూక.

మన దేశములో విద్యా నిపుణులనేకులు కలరు గాని తదనుగుణమయిన సద్వర్తనము కలవారంతగా లేరు.

- మూక.

నేరముచేసిన తరువాత వారిని శిక్షించుటకంటె నేరము జరుగక మునుపే నివారించుట యుత్తమ లక్షణము.

- ఉప.

మన సౌఖ్యముగాని దుఃఖముగాని మిత్రులయొక్క యోగ్యతా యోగ్యతల వలననే యెక్కువగుటయు తక్కువగుటయు సంభవించునుగాన సదా యోగ్యుల తోడనే మైత్రి నెరపి తల్లాభముల ననుభవింపుచుండ వలయును.

- ఉప.

సాధారణముగా మనవారు సభలలో నిష్ప్రయోజనములైన విషయములను గూర్చియు పరుల దోషములను గూర్చియు ముచ్చటింతురు.

పనికిమాలిన సంగతులను మాటాడుటవలన దమ కాలమును వ్యర్థ పుచ్చు కొనుటయేగాక ఇతరులకు విసుగువచ్చునట్లుచేసి వీరి కాలమును నిష్కారణముగా పాడుచేసిన వారగుదురు.

- ఉప.

బెల్లమున్నచోట యీగలు ముసురునట్లు మనవాడొకడు మంచి దశలో నున్నప్పుడు ఎక్కడెక్కడివో తరములనాటి బంధుత్వములు తెలుపుకొనుచు వచ్చి బంధువు లాతని నాశ్రయింతురు.

- స్వీ.చ.మొ.భా.పు. 8

ఆపదలు రావారంభించి నప్పుడొక్కదానితో బరిసమాప్తికావు.

- స్వీ.చ.మొ.భా.పు. 10

ధనదేవత పలాయనమయిన తరువాత దానివి విడిచి గర్వ మొంటిగా చిర కాలము నిలిచి యుండనేరదు.

- స్వీ. చ. మొ. భా. పు. 10

ఎవ్వనికైన నొక విషయమున నొక న్యూనతయున్న పక్షమున నింకొక విషయమున నాధిక్యమును గలిగించి ఈశ్వరుడా లోపమును పూరించునని విద్వాంసులు చెప్పుదురు.

- స్వీ. చ. మొ. భా. పు. 21

పిన్నలలోను పెద్దలలోను గూడ నే వెర్రికి దగిన యా వెర్రివారే కాలము నందును నుండక మానరు.

- స్వీ చ. మొ. భా. పు. 24

అవిభక్త కుటుంబములలో నంతఃకలహము లుద్భవిల్లి యైకమత్యము చెడి సుఖభంగము కలిగినప్పుడు కుటుంబ స్నేహమును మరల నెలకొల్పుటకు వేరు పడుటయే యుత్తమ సాధనము.

- స్వీ చ. మొ. భా. పు. 34

కలిసియుండినప్పు డైకమత్యమును బరస్పరానురాగమును లేని వారనేకులు విభక్తులయిన తరువాత బహుకుటుంబములలో మరల నన్యోన్య మైత్రిని బడసిన వారయి పరస్పర సహాయులయి సుఖించుచున్నారు.

- స్వీ. చ. మొ. భా. పు. 34

రూపాయల గాలి సోకినప్పుడు వాని ముందర బంధుత్వమును మిత్రత్వమును సమస్తమును తృణకణములవలె నెగిరిపోవలసినవే గదా.

- స్వీ. చ. మొ. భా. పు. 48

తమ మంత్రములయందు పటిమ లేదని యెరిగి ధనార్జనమునకయి మారు వేషములు వేసి పరులను మోసపుచ్చుచుండు వారు సహిత మితరుల మంత్రముల యందు పాటవము కలదని నమ్ముచుందురు.

- స్వీ. చ. మొ భా. పు. 74

మనవారు సాధారణముగా యుక్తియుక్తముగాను సప్రమాణముగాను వాదప్రతివాదములు చేయుట మాని నడుమ వక్తవ్యాంశమును విడిచి యన్యోన్య దూషణమునకు దిగుదురు.

- స్వీ.చ.మొ.భా.పు. 75

పలుచోట్లనుండి వచ్చి బహువిధాభిప్రాయములను గలిగిన వారెక్కువ మంది యొక్కచోట గూడినప్పుడు వారిలో నైకమత్యముండుట యరుదుగదా.

- స్వీ.చ.మొ.భా.పు. 226

లోకములో కష్టముల మీదనే కష్టములు సంప్రాప్తములగును.

- స్వీ.చ.మొ.భా.పు. 244

సాధారణముగా పండితులు వాదములో తాము పరాజయము నొందినను తమ యోటమి నొప్పుకొనక ''శేషంకోపేనపూరయేత్'' అను న్యాయము నవలంబించి క్రింద బడినను తామే గెలిచితిమని కేకలు వేయుదురు.

- స్వీ.చ.మొ.భా.పు. 278

పదిమంది చేరిన తరువాత గొన్ని మనస్తాపములును చిక్కులును కలుగక మానవుగావి చేసిన మహాకార్యమును తలచుకోగా అవి యెంత మాత్రమును గణనకు దేదగినవిగా నుండవు. కొందరు ధనాశాపరులుగా నుండి పలు మిషల మీద దొందరలు కలుగజేయవచ్చును. కొందరవివేకము చేతను కొందరు దుస్స్వభావము చేతను తగవులాడ వచ్చును.

- స్వీ.చ.మొ.భా.పు. 306

విద్యలేని మూఢులు పలువురుచేరి చేయుదానికంటె విద్యాధికు డొక్కడు చేయుహాని శతగుణము లధికముగా నుండును.

- స్వీ.చ.మొ.భా పు. 311

విద్యనేర్చిన వారిలో కొందరు స్వప్రయోజన పరత్వమును సహితము పరోపకారార్థమే యయినట్టు చూపగల శక్తిమంతులు.

- స్వీ.చ.మొ.భా.పు. 315

ఉపాధ్యాయులే నీతిమాలిన వారయినప్పుడు వారి శిష్యులైన విద్యార్థులేమి నీతి మంతులగుదురు.

- స్వీ.చ.మొ.భా.పు. 408

కాల మెప్పుడును నేకరీతిగా నుండదు. కాలమహిమచేత బాహ్యపదార్థముల లోని మార్పుల మాట యటుండగా నంతరంగములు సహిత మత్యంత కఠినము లయినవి క్రమక్రమముగా మృదువులగును; దీర్ఘ వైరములును ప్రణయములుగా మారును.

- స్వీ.చ.రెం.భా పు. 115

కొందరికి బరులను దూషించునప్పుడును సత్యమో యసత్యమో వ్రాసి ఇతరుల మంచిపేరు చెడగొట్ట బ్రయత్నించినప్పుడును కలుగు సంతోషము మరి యొకప్పుడు కలుగదు.

కొందరు తామావగింజంత యయినను పనిచేయని వారయినను చేయు వారిని దూషించుటలోను చేసిన పనిలో తప్పులెన్నుటలోను దమకుగల యసాధారణ పాండిత్యమును గనపరుతురు. కొంద రితరులను దూషించినప్పుడెంత సంతోష మును బొందుదురో ఇతరుల భూషణమును విన్నప్పుడంత సంతాపము నొందు దురు.

- స్వీ.చ.రెం.భా.పు. 291

తార్కికుడును వైయాకరణుడు నగుట సులభముకాని యోగ్యుడగుట యంత సులభముకాదు.

- రాజ.

అదియేమి మాయయోకాని లోకములో నెల్లవారును తాము సుఖపడుటకయి వహించుదాని కంటె, దాము సుఖము ననుభవించు చున్నట్లితరులకు దోచుటకయి యే విశేషశ్రద్ధను వహింతురు.

- రాజ.

తప్పు కరవవలెనని ప్రయత్నముచేసిన నెంత ప్రయోజనకారి యగునో ఓద వాడు గొప్పవానిని పగసాధింప దలపుగొన్న, నంత ప్రయోజనకారిగానే యుండును.

- రాజ.

తాలూకా గుమాస్తాల చేతులలో వెండి నాణెముల రూపమయిన దివ్యౌషధము పడిన పక్షమున దాని ప్రభావముచేత లెక్కల యందలి తప్పులన్నియు ఒప్పులగు నవియు, ఆ దివ్యౌషధము చేతికి తగులని పక్షమున తిన్నగా నున్న లెక్కలు సహితము తప్పుల కుప్పలగునవియు అనుభవశాలులు చెప్పుదురు.

- సత్య.

నోటితో నూరు నీతులను చెప్పుటకన్న చేతితో నొక్కకార్యమే చేసిచూపిన యెడల అది యెంతో ప్రయోజనకరముగా నుండి పలువురను మంచి మార్గమున నడిపించును.

- సత్య.

అత్త కాలము కొన్నాళ్లను కోడలి కాలము కొన్నాళ్లను నన్నట్లు పాఠశాలలలో నిప్పుడుపాధ్యాయుల కాలము పోయి బాలుర కాలమువచ్చి యుపాధ్యాయులకు బాలురు భయపడవలసిన దానికి మారుగా బాలురకే యుపాధ్యాయులు జడియుచు వచ్చిరి.

- సత్య.

కప్పకు బురదనీళ్ళింపయినట్టు పన్నీరింపగునా ?

- సత్య.

ఒరులమేలుచూచి యోర్వలేనివారు రోగములేకయే బాధపడుచుందురు.

- చంద్ర.

దుర్మార్గములో ప్రవేశించి దానిలో పాగి నడిచినకొలదిని దానినుండి మరలుట యెక్కువ కష్టముగా నుండును.

- సత్యసం.

# 6. సంఘ సంస్కరణం

పూర్వులాదియందు బాల్య వివాహమన్న పేరే యెరిగి యుండరు. వేదముల యందలి బాల్య వివాహమన్నమాటయే మృగ్యము. అస్వాభావికమైన ఈ యతి బాల్య వివాహపీడ యాచారపిశాచా వేశబలముచేత వచ్చినదే కాని విధివిహిత మైనది కాదు.

- స్వీ.చ.మొ.భా.పు. 27

నా పెండ్లిలో మావారే వ్యయములను తగ్గించినను భోగము మేళమునకగు వ్యర్థవ్యయమును మాత్రము చేయక మానినవారు కారు.

వేశ్యలు లేకున్న వివాహమునకు శోభయేలేదట. గృహస్థుల గౌరవమునకు భంగము కలుగునట. నలుగురిలో తలవంపులట. మౌఢ్యజన్యములయిన ఇట్టి విపరీతాభిప్రాయములకు మేర యెక్కడిది.

- స్వీ.చ.మొ భా.పు. 27

ఈ కాలమునాటికి నా పూర్వవిశ్వాసములు కొన్ని మార్పు చెందుచుండినట్టు చెప్పియుంటివి గదా. దయ్యములు పట్టినవారి ఇండ్లకు తరుచుగా బోయి వారి చేష్ట లను నటనలను లక్షణములను పరీక్షించుచుండుటచేతను మంత్రవేత్తలమను వారు చేయు కుతంత్రములను మాయలను శోధించుచుండుటచేతను భూతావేశమునందు నాకు నమ్మకము పోయినది.

- స్వీ.చ.మొ.భా.పు. 68

ఈ కాలమునందు జ్యోతిశ్శాస్త్రములోని ముహూర్త జాతక భాగముల యందును శకునములు మొదలైనవాని యందును గూడ నాకు విశ్వాసము పూర్ణ ముగా చెడినది. నమ్మకములేని వానిని పామరుల సంతుష్టికై నమ్మినట్లు నటించి యాచరించుచుండుట సాధారణముగా నా స్వభావమునకు సరిపడదు.

- స్వీ.చ.మొ.భా.పు. 69

లంచము లిచ్చెడు ప్రజలలోను పుచ్చుకొనెడి యధికారులలోను నీతి గౌరవము వర్ధిల్లక లంచములడగవు.

- స్వీ. చ. మొ.భా.పు. 81

లంచములు తగవన్న రాజకీయోద్యోగులకు కోపము; వేశ్యాంగనా సంగము నీతిగాదన్న శృంగార నాయకులకు కోపము: పూర్వాచారమును మార్చుకోవలెనన్న పామర జనులకు కోపము; నీతిమాలిన బాహ్యవేషములు మత విరుద్ధములన్న ఆచార్య పురుషులకు కోపము. మా పత్రికోద్దేశమును నిశ్శంకముగా నిర్వహింపవలసినచో నిన్న కోపములను సరకు సేయకుండవలెను.

- స్వీ. చ. మొ.భా.పు. 88

ఆ కాలమునందు వేశ్యాప్రియుల సంఖ్య మేరమీరి యుండెను. ఆ విషయమయి నేను పత్రికలో మొట్టమొదట పరుషముకాకుండ వ్రాసినదానిలోని కొన్ని పంక్తుల నిట నుదాహరించెదను-'ఈ కాలముననో జారిణీసంభోగమే సత్కృత్యమని కొనియాడబడు చున్నది. కట్టుకొన్న యాలిని దుఃఖపెట్టి పరాంగనల గలియువారు గర్హణీయులుగా నెన్నబడకున్నారు; మరి లంజెలులేనివారు పెద్ద మనుష్యులే కారని గణింపబడుచున్నారు; మీదు మిక్కిలి యేక భార్యావ్రతస్థులు పురుషులే కారనియు నపుంసకులనియు బరిహసింపబడుచున్నారు. ఎల్లవారిచే గొప్పవారని గౌరవింపబడుచున్న ధనికులయిన యధికారస్థులే వేశ్యల కింటిబంటులయి వారికి వశవర్తులయి యా బోగము చానల నాశ్రయించినవారినే గౌరవింపుచుండుటచేత నా ధనికుల యనుగ్రహము నపేక్షించి వారి వలన బాగుపడదలచి యాశ్రయించుచున్న వారందరును ఆ చెడు పడతుకల యడుగులకు మడుగు లొత్తవలసినవారుగానున్నారు.'

- స్వీ చ. మొ.భా.పు. 90

ఆ కాలమునందు రాజమహేంద్రవరములో పాఠశాల యనగా వేశ్యల చదువుకూటమనియే యర్థము. వేశ్యల నృత్యగీతాదులకై పెట్టింపబడిన పాఠశాల లప్పుడా పురమునందెన్నియో యుండెను. వేద పాఠశాలలకును శాస్త్రపాఠశాలలకును చిల్లిగవ్వ ఇయ్యనొల్లని శుద్ధశ్రోత్రియులు సహిత మధికారుల మెప్పుకయి ఈ వేశ్యల పాఠశాలలకు నెల కయిదుబ పదుబ రూపాయలు చందాలిచ్చుచుండిరి.

- స్వీ.చ.మొ.భా.పు. 91

ఆ కాలమందు వేశ్యనుంచుకోనివా డరసికుడనియు పౌరుషహీనుడనియు భావింపబడుచుండినట్టే లంచములు పుచ్చుకోని వాడ ప్రయోజకుడనియు బుద్ధిహీను డనియు పరిగణింపబడుచుండెను.

లంచములు గైకొనుట యుద్యోగ ధర్మమని యెల్లవారును దలచియుండుట చేత నిచ్చువారుగాని పుచ్చుకొనువారుగాని దానిని తప్పుగా దలపకుండిరి. రహస్య మన్నది లేక బంటు మొదలుకొని మంత్రివరకును రాజపురుషు లందరును బహి రంగముగానే యుత్కోచ స్వీకరణము చేయుచుండిరి.

- స్వీ చ. మొ భా.పు. 112

మా వివేకవర్ధని సంఘ దురాచార సంస్కార నిమిత్తము మొదటినుండియు పాటు పడుచుండెను

అతి బాల్యవివాహములు అతి వృద్ధ వివాహములు కన్యాశుల్కము మొద లయిన వాని వలన యనర్థములను బోధించుటకయి బ్రాహ్మవివాహము ప్రకటింప బడినది.

- స్వీ.చ. మొ.భా.పు. 140

రెండు మూడేండ్ల బాలికలకు వివాహము చేసిన వారిని, శుల్కమును గ్రహించి తమ కొమారితలను వృద్ధులకును వికలాంగులకును కట్టిపెట్టిన వారిని బహిష్కరించెదమని కులమువారు పని పూనినంగాని నిజమయిన సంస్కారము జరగదు. కులము వారికిగాని జగద్గురులమనియు ధర్మ స్థాపన కర్తలమనియు జెప్పుకొనెడు పీఠాధిపతులకుగాని యంతటి మగతనములేదు

- స్వీ చ మొ.భా.పు. 141

మన దేశములో యాచ్నా వృత్తి హేయముగా నెంచబడకుండుటయు పాటు పడక గూరుచుండుట గొప్పయని తలంపబడుచుండుటయు చిరకాలా గతాచారముల గుట చేత కాయ కష్టపడక నిరుద్యోగముగా గూరుచుండి స్వోదర పోషణార్థ మితరులను వేడి ధనార్జనము చేయుట లాఘవమని యెవ్వరును భావింపకున్నారు.

- స్వీ.చ. మొ.భా పు. 311

తులసీ రుద్రాక్షమాలాది బాహ్య చిహ్న ధారణమునకంటె సత్ప్రవర్తనము మతమున కధికావశ్యకమని జనులలో విశ్వాసము కుదురు వరకును మతము పరిశుద్ధమయి దురాచారనివారకము కానేరదు.

- స్వీ.చ.రెం.భా.పు. 81

మా వివేకవర్ధని తన కారు మాసములు వచ్చినది మొదలు గొప్ప వారిలోని దుర్నీతిని మాన్పుటకయి ప్రయత్నింప నారంభించినది. అప్పుడు మా మండల న్యాయ సభలో న్యాయవాదిగా నుండిన వారొక రొక వేశ్యకు కన్నెరికము చేయగా వివేకవర్ధని దానిని ప్రకాశపరచి యా ఘనుని సిగ్గుపడునట్లు చేసినది.

- స్వీ.చ.రెం.భా.పు. 88

సంఘసంస్కరణ సమాజ కార్యములందును బ్రహ్మ సమాజ ధర్మ వ్యాపనమునందును నాకు విశేషాభిమానము.

- స్వీ.చ.రె .భా.పు. 100

మన తప్పులను కప్పి పుచ్చి మంచివారని యితరులకు తోచునట్లు చేయవలెననుట కొందరి మతము. మన తప్పులను వెల్లడించి వానిని తొలగించి మన వారిని నిజముగానే మంచి వారిని చేయవలెననుట మరికొందరి మతము. నే నీ రెండవ తెగలో జేరినవాడను.

పుండు పుట్టినప్పుడు దానిని కోసి చికిత్స చేసి మాన్పింపక పుండే లేనట్లు నటించుటలో లోపల కుళ్ళు చుండగా పైపైని రామయ స్థితిలో నున్నట్టు పొగడు చుండుటవలన లాభమెప్పుడును గలుగనేరదని నా యభిప్రాయము.

- స్వీ.చ.రెం.భా పు. 178

వివాహ విషయమును వధూవరుల యిష్టమునకు విడువవలసినదేకాని తదితరులందులో సంబంధము కలిగించుకొని బలవంతపెట్టరాదని నా యభిప్రాయము.

- స్వీ.చ.రెం.భా.పు. 263

తక్కిన పాఠశాలలకంటె హితకారిణీ సమాజము వారి ఈ పాఠశాలలో రెండు విశేషములున్నవి. అందొకటి పురుషులతోడిపాటుగా విద్యాభిలాషగల స్త్రీలను గూడ జేర్చుకొని చదివించుట.

బాలుర పాఠశాలలో బాలికలను జేర్చుకొనుట యనర్థదాయకమని ప్రారంభములో కొందరు భావించి సందేహపడిరి.

స్త్రీలను గౌరవించెడు సద్గుణమును పురుషులకు చిన్నతనములోనే నేర్పవలెనన్న యాశతో గలిపి స్త్రీలను చదివించెడు పద్ధతికి దారి యేర్పరచితిని

మా పాఠశాలలో రెండవ విశేషము పంచమ బాలురను గూడనా యా తరగతులలో జేర్చుకొని చదువు చెప్పుట.

బాలికలకు వలెనే మొదటి ఫారము మొదలు పయి తరగతులలో జదువు పంచమ బాలురకును జీతములు గైకొనక ధర్మార్థముగా చదువు చెప్పబడును.

- స్వీ. చ. రెం. భా. పు. 352-53

కొందరు జుట్లను బొట్లను తీసివేసినంత మాత్రముననే తాము ఘనులమైతిమనుకొని సత్కార్యాచరణమును సరకు గొనకున్నారు

కొందరు భోజనములను బోటితలు మాత్రమే ప్రధానము అనుకొని లోకోపకార చింతను దూరము చేయుచున్నారు.

ఇట్టి బుద్ధిమంతులు బాహ్యవేషముల కంటె మనస్సౌందర్య మధికమైనదిగా నెరిగి సత్యాదుల యందధిక గౌరవమును జూప నేర్చుకొందురు గాక.

- స్వీ. చ. రెం. భా. పు 378

నే నెప్పుడును ధనవంతుడను గాను; బలవంతుడను గాను; అధికారవంతుడను గాను; అధిక విద్యావంతుడను గాను; ఇట్లు మహాకార్యనిజయ నిర్వహణములకు గావలసినవానిలో దేనిని గలవాడను కాకపోయినను దేశాభిమాన మొక్కటి మాత్రము కొంచెము కలవాడనగుటచేత దత్ప్రేరణమువలన శక్యాశక్య విచారము చేయక దేశ సంస్కరణోద్యమములో నడుగుపెట్ట సాహసించితిని.

నేను పూనిన యా కార్యము నెంతవరకు నిర్వహింప గలిగితినో చెప్పలేనుగాని దాని నిమిత్తమయి నాకుండిన యల్ప ధనమును యౌవనమును బలమును విద్యను బుద్ధిని ధారవోసి మీ యాదరమునకు బాత్రుడను కాగలిగితినని మాత్రము చెప్పగలను.

నా యల్ప సంస్కార ప్రయత్నమును బట్టి తెలుగు దేశములో రాజమహేంద్రవరము సంస్కారములకు జన్మభూమి యని పేరుబడినది.

– స్వీ.చ.రెం.భా.పు. 455

సంఘ సంస్కారోద్యమమునందు ఎక్కువ కష్టములున్నవనుటకు సందేహము లేదు

ఏ కార్యమునందును కష్టపడినంగాని ఫలము గలుగదు.

ఎక్కువ ఫలముల ననుభవింపగోరు వారెక్కువ కష్టములను పడవలెను.

ఈ పనియందిప్పుడు పామరులవలని బాధ మునుపున్నంతలేదు.

ఒక రేవిషయమునన్నైనను పనిచేసి పేరుపొందుచున్నప్పుడీర్ష్యాళువులయిన వారు కొందరు బైలుదేరి యోర్వలేమిచే వారిపైని లేని దోషముల నారోపించుచు వారి పేరునకు భంగము కలిగింపబాటుపడుదురు.

మరికొందరు వారి కీర్తికి మాలిన్యము కలిగించి వారి నడగద్రొక్కుటచేతనే తాము పైకి రావలెనని ప్రయత్నము చేయుదురు.

ఈ యిరు తెగలవారి వలని యుపద్రవము సంఘ సంస్కార దీక్షవహించి నాయకులయి పనిచేయు వారికెట్లో యట్లే రాజ్యాంగ సంస్కార ప్రయత్న ప్రతిజ్ఞను పూని నాయకులై పనిచేయు వారికిని గలదు.

– స్వీ.చ.రెం.భా.పు. 461

దోషైక దృక్కులు జనులకు జేసెడిది యుపకారలేశమయినను గానబడదు. లౌక్యాధికార ధూర్వహులనేకులు తమ కన్నుల యెదుట లంచములు పుచ్చుకొని ధనికులగుచుండగా వారియ కార్యమును గూర్చి యొక్క మాటయైన పలుకుటకే విలేఖకులకు నోరు రాదు; వ్రాయుటకు గలము సాగదు. రేయుంబగళ్ళు కష్టపడి న్యాయముగా బనిచేయు వారిని దూషించుటకు మాత్రమే వీరికి పెద్దనోరు వచ్చును. సాంఘిక విషయమునగాని మరియే యితర విషయమునగాని యొక్క దురాచారమును మాన్పుటకయి ప్రయత్నించుటకైనను వీరి కెప్పుడును బుద్ధి పుట్టదు.

మాన్పుటకయి ప్రయత్నించువారిని నిందించుటలో మాత్రము వీరికెక్కడ లేని బుద్ధులును నుదయించును.

సంస్కార సంబంధమున వివిధ విషయములలో వివిధ మార్గముల వివిధ బుద్ధిమంతులు పనిచేయవలసి యున్నది.

మనదేశాభివృద్ధికిప్పుడు పని కావలెనుగాని యదిలేని పొడి మాటలు కావలసి యుండలేదు.

మన యాంధ్రదేశమునందు సాంఘిక ధార్మిక విషయములలో బనిచేయుట కయి యేర్పడియున్న సమాజములలో రాజ మహేంద్రవరమునందు స్థాపింపబడి యున్న హితకారిణీ సమాజము ముఖ్యమైనదని చెప్పవచ్చును.

- స్వీ.చ.రెం.భా పు. 468

ఏ దేశమందును జనులందరు నేదో యొక యుపయోగకరమైన పనియందు పాటుపడుచున్న యెడలనే దేశమభివృద్ధిచెంది కొందరు మాత్రమేకాక సామాన్య ముగా దేశములోని వారందరును సమస్త సంపదలు గలిగి సౌఖ్యము ననుభవించు చుందురు.

- ఉప.

పాటుపడక పోవుట యొకటియేకాక మనదేశమును దరిద్ర దశకు దెచ్చు టకు మరియొక కారణము కూడ గలదు.

మనలో చదువుకొన్న వారందరును వాణిజ్యాది స్వేచ్ఛావృత్తుల యందు ప్రవేశించుట తమ పరువునకు దగినపని కాదని యెంచి సేవకవృత్తికొరకే కాచు చున్నారు.

చదువుకొన్న వారెక్కువ యయిన కొలది ఉద్యోగములు వలసినన్ని దొరకకయు వారు మరియొక వృత్తిలో బ్రవేశింపకయు బీదతనమును పొందువారి సంఖ్య నానాటికి పెరుగుచున్నది.

ఎప్పుడును కృషి శిల్ప వాణిజ్యాదులచేత దేశముయొక్క కలిమి వృద్ధి యగునుగాని సేవక వృత్తిచేత కానేరదు.

- ఉప.

ఐకమత్యమున కసాధ్యమెద్దియును లేదు. సర్వశ్రేయములకు నదియె నిదా నము. అధిక ప్రయాసము గొనియు నొక్కనికి సాధ్యముకాని పని పలువురైక మత్యముం గలిగి పాటుపడుచుండిని సులభ సాధ్యమగును.

జగత్తున నే దేశమువారెప్పుడు వృద్ధిలోనికి వచ్చినను అది యంతయు నైకమత్యము చేతనే.

- వివే. 1875

ఐకమత్యమును సత్కార్యములయందె యుపయోగించిన వాణిజ్యాదులచే దాము బాగుపడుటయేకాక శీఘ్రకాలముననే దేశమును గూడ మంచి దశకు దేవచ్చును.

- వివే 1875

ఏ కాలము నందును ప్రతి దేశమును వాణిజ్యాదులవలననే సర్వోన్నత పదముల బొందియున్నట్టు వినుచున్నాముగాని సేవకవృత్తిచే నెప్పుడుగాని యెవరును దమ దేశమును మంచి స్థితికి దెచ్చుకొన్నట్టు వినియుండలేదు.

ఇప్పటి మనలోని చదువుకొన్న వారందరును మరియొక వృత్తికిం జొరక హేయమైన ఈ యధమవృత్తినే యవలంబించుచున్నారు.

సేవక వృత్తియే తమకు శరణమని నమ్ముకొని యుండుటవలన గ్రమక్రమమున నా యుద్యోగ గౌరవమును చప్పబడుచున్నది.

చదువుకొన్న వారును చవుక యవుచున్నారు.

- వివే. 1875

ప్రతి సంవత్సరమును లక్షల కొలది ధనమును వ్యాజ్యముల క్రింద పాడు చేయు మన జమీన్‌దారులు మొదలగు వారు తమ ధనమును దేశమునకు క్షేమకరములయిన యంత్ర స్థాపనాదులయందు వినియోగింప జూతురని కోరుచున్నాము.

(వివే 1880)

తాము చేరియున్న జాతివారి యొక్కయు మతము వారి యొక్కయు నభివృద్ధిని మాత్రమే కోరుచు తక్కిన వారినడగ ద్రొక్కుటకయి యెంత మాత్రమును బ్రయత్నింప రాదు.

పూర్వ కాలమునందించు మించుగా నన్ని దేశములలోను బలవంతులు బలహీనులను ధనికులు బీదలను ప్రబలనీయక యణచివేయుట సహజ కృత్యముగా నుండెను. నాగరకత హెచ్చిన కొలదిని ఇప్పుడు బహు దేశములయందు సాధారణ

జనుల స్వాతంత్ర్యములు చక్కగా కాపాడబడుచు వచ్చుటచేత వారి పరిస్థితియు బాగుపడుచున్నది.

దేశమును మంచిదశకు తీసుకొని వచ్చి లోకములో ప్రఖ్యాతి కెక్కుడు దేశములలో నొకదానిని చేయవలెనన్నచో మొట్టమొదట సామాన్య జనులయొక్క స్థితిని బాగు చేయుటకు ప్రయత్నపడ వలయును.

- వివే. 1880

మన పూర్వులు సాధ్యమయినంత మట్టుకు తమలో కొన్ని వర్ణముల వారు మాత్రమే యుత్కృష్ట దశయందుండవలయు ననియు మిగిలిన వర్ణముల వారు నికృష్ట దశయందుండవలయు ననియు స్వప్రయోజన పరులయి శాసనములను కల్పించి క్రమముగా దేశమును క్షీణదశకు తెచ్చి జనులలోని యైకమత్యమునకు భంగము కలిగించి మన దేశమునన్యాక్రాంతమగునట్టు చేసి తాము చెడిపోయిరి.

- వివే. 1880

ఏమి కాలకర్మ దోషముననో కాని మన దేశమునందు వ్యభిచారమున కని ప్రత్యేకముగా నొకజాతి యేర్పడి రంకుతనమున కనుజ్ఞ ఈ బడియున్నది.

చిరకాలమునుండి యాచారముగా వచ్చుచుండుటవలన నొక వేళ మనవారి కది దూష్యముగా గనపడక పోవచ్చునుగాని న్యాయదృష్టి కలిగి పరిశీలనముచేయు వారికి ఇతరదేశీయులకును ఘోర పాతకముగా గనబడి మన విషయమై దురభిప్రాయము కలుగకపోదు.

- వివే. 1880

లోకములో నెందును కృషి వాణిజ్యాదులవలననే ధనలాభము విశేషముగా గలుగును గాని న్యాయమార్గమున బ్రవర్తించువానికి రాజకీయ సేవవలన విశేష విత్తమెన్నడును లభింపనేరదు.

సర్వదేశముల యందును రాజకీయ సేవకన్న కృషివాణిజ్యాదులే సర్వ విధముల గౌరవ ప్రదములని యెన్నదగి యున్నవి.

అయినను ప్రస్తుత కాలమునందు కృషి వాణిజ్యములందు కంటె రాజకీయోద్యోగములయందే యధిక గౌరవము కలుగుటకు కారణమేమని విచారింపగా

కృషి వ్యాపారములయందు విద్యావంతులు ప్రవేశింపకపోవుటయే యని కరతలా మలకముగా తెలియుచున్నది.

చదువుకున్న వారు పలువురేవృత్తియందు ప్రవేశించిన నావృత్తికే గౌరవము కలుగును.

సర్వత్ర స్త్రీ పునర్వివాహము వ్యాపింపని ఈ కాలములో కన్యలకు సాధ్యమైనంత యాలస్యముగా వివాహము చేయుట యుత్తమము.

అతి బాల్యవివాహమువలన వధూవరుల కిద్దరకును మితిమీరిన నష్టము లున్నవి.

- వివే. 1880

పాత్ర దానమువలన దేశమునకు లాభము కలిగినట్టే యపాత్రదానము వలన బహువిధములయిన నష్టములు గలుగును.

- వివే. 1882

కొన్ని పట్టణములయం దిప్పుడగ్రవర్ణముల వారిలో గూడ త్రాగుబోతుతన మంతకంతకు ప్రబలుచున్నది.

మా పట్టణములో సారాదుకాణములు పది సంవత్సరముల క్రింద కంటె నిప్పుడు పదిరెట్లెక్కువ యైనవి.

సమస్తానర్థములకును మూలమయిన త్రాగుబోతుతనమును నాగరకాగ్రగణ్యులయిన ప్రభుత్వమువారు ప్రోత్సాహపరచుచుండుట కంటె నవమానకరమైన కార్యము మరియొకటి యుండదు.

నీతిరక్షణ పరాయణులయిన దొరతనము వారు పదింబదిగ విచారించి రాబడి తక్కువగునన్న యాలోచనను మాని జనుల నీతికిని క్షేమమునకును భయంకరముగా నున్న సురాపానము నిరుత్సాహపరచి క్రమక్రమముగా తగ్గించుటకు ప్రయత్నింతురని నమ్ముచున్నాము.

- వివే. 1882

కార్యశూరులు లేక కేవల వాక్శూరులు మాత్రమే యున్న యెడల నే దేశమును నెప్పటికిని వృద్ధికానేరదు.

వివే 1888

# 7. దేశభాషలు-విద్యారంగం-దేశాభిమానం

దుష్టపండితుల కన్న గర్హణీయులు ఈ జగత్తులో మరి యెవ్వరుగాని కలుగ బోరు.

- వివే. 1875

గుణము లేకున్న వారి విద్యయంతయు నడవిలో గాచిన వెన్నెలవలె నిరర్థకమగును.

తనకెంత విద్య కలిగియున్నను దుర్జనుడెప్పుడును విడువబడదగిన వాడే యగును గాని యాదరింపబడదగినవాడు కాడు.

సరివారిలో గౌరవము దెచ్చుటకు గుణము ప్రధానముకాని అదిలేని వట్టి వయసును, కేవలవిద్యయును ప్రధానములుకావు.

- వివే. 1875

ప్రవర్తనము మాత్రము మంచిది కాకపోయిన చదివిన వేయిగ్రంథములు వ్యర్థములుగదా. గ్రంథములెన్ని చదివినను యుక్తాయుక్తములను కృత్యాకృత్యములను యోగ్యతా యోగ్యతలను దెలిసిసన్మార్గమున మెలగుచున్నమీదట గాని యెవ్వడును పండితుడని యెంచబడడు.

- వివే. 1875

అయుక్తములైన సంగతులను పండితులు వ్రాసినను గ్రహింప గూడదు. యుక్తములైన వానిని బాలుడు చెప్పినను గ్రహింపవలయును.

- వివే. 1875

విషయములను దెలుపు పుస్తకములు మొదలగునవి సులభముగా బోధపడు లాగున సాధ్యమైనంత తేలికగా నుండు వచనమున వ్రాయబడి యుండుట యావశ్యకము.

గ్రంథములు చదువు వారికి సులభముగా దెలియు లాగునను సందేహములు కలుగకుండునట్లుగాను వ్రాయబడవలసినది. అట్లుగానిచో విద్యలు సమస్తమైన

వారికిని సాధ్యములుగాక దుర్జేయములై యుండును; దానం బట్టియవిక్రమక్ర మముగా క్షీణించి నామమాత్రావ శిష్టములగును.

పుస్తకములు సంస్కృత భాషను వ్రాయుటకంటె దేశభాషలలోనే వ్రాయుట చాల మేలైనవని, ఉపయుక్త గ్రంథములను వచనములుగా వ్రాయుట ముఖ్య కార్యము.

జ్ఞానాభివృద్ధికయి రచియింపబడు శాస్త్రాదికము తప్పక వచనరూపముగనె వ్రాయబడవలయును.

బాలురకు చెప్పించు గ్రంథములు మొదలుగాగల వానిని వాని యర్థమును లేశముగాని యెరుగనివారి చేతనే నేర్పించుచున్నారు. చెప్పువారికే తాము చెప్పెడి దేమో తెలియనప్పుడు వారి యొద్ద చదువుకొను వారికేమి తెలియగలదు?

అట్టి చదువువలన చదివించు వారికిని చదువు వారికిని కూడ వృధాయాస మును వ్యర్థముగా కాలయాపనమును సంరక్షకులకు నిష్కారణముగా ధనవ్యయ మును దక్కనొక్క ప్రయోజనము గలుగనేరదు.

అట్టి చదువుచేత విద్యల నభ్యసింపదగిన మంచికాల మంతయు వ్యర్థముగా బోయి పిదప విద్యలంటక విద్యార్థులకు ననర్థకము కలుగుచున్నది.

- వివే. 1875

గ్రంథకర్తలలో గూడ గొందరు తమకు తెలియని విషయములను గూడ తెలిసినట్టు వ్రాయువారు నుందురు. విషయమును బట్టి వారు వ్రాసినదానికి గౌరవ ముండవలయునే కాని వారిని బట్టి విషయమునకు గౌరవము రాగూడదుగదా.

సాధారణ జనుల యభివృద్ధికయి మనము చేయవలసిన పనులనేకము లున్నను వారిలో విద్యాభివృద్ధిజేసితిమేని తక్కిన వన్నియు తమంతటనే నివార ణము కాగలవు.

జనసామాన్యమునందు విద్యాభివృద్ధి కలిగిననేకాని యెప్పుడును నే దేశ మున్ను మంచి దశయందున్నదని చెప్పవలను గాదు.

జనోపయోగకరములైన శిల్పశాస్త్రాదులలో బెక్కులు మనవారి తెలివి తక్కువ వలననే చూచువారులేక నశించినవి.

- వివే. 1880

ఏమికాల కర్మ దోషమననోకాని మనదేశములో కొంతకాలము నుండి చదువు నేరవి వారిచేతనే బాలురకు చదువు చెప్పింప బానెడి వెర్రి ప్రబలుచున్నది పిల్లలకు విద్య నేర్పి వారిని వివేకులుగా జేయు భారమును పైని వేసికొను వాడెంతటి పండితుడయి యుండవలెను ?

- వివే. 1880

రాజకీయ పాఠశాలలయందు తెలివిని వృద్ధి పరచుటకయి విశేష శ్రద్ధ పుచ్చుకొనబడుచున్నదే కాని దేహదార్ఢ్యమును స్థిరపరచుటకును నీతి వర్తనమును పెంపు చెందించుటకును లేశమయినను శ్రద్ధ పుచ్చుకోబడుచుండలేదు.

- వివే. 1880

పత్రికా ప్రకటనమునందు నా యుద్దేశములు భాషాభివృద్ధియు దేశాభివృద్ధియు ముఖ్యముగా రెండు.

దేశాభివృద్ధి మార్గము జనులలోగల దురాచార దుర్వర్తనముల బాపియు వృద్ధిపద్ధతులను జూపియు వారి నధిక నీతిమంతులనుగా జేసి దేశము నున్నత స్థితికి దెచ్చుటకయి శక్తివంచనలేక పాటుపడుట.

దేశాభివృద్ధి కలుగుటకయి విద్యావిషయమునను వ్యవహార విషయమునను కులాచార విషయమునను నీతివిషయమునను మత విషయమునను నానా ముఖముల కృషి చేయవలయుననియే కాని యొక్క రాజ్యాంగ విషయములయందే పని చేయుట నా యుద్దేశము కాదు.

- స్వీ. చ. మొ. భా. పు 80

జనులలోగల మూఢవిశ్వాసములు పోవుటకు ప్రకృతిశాస్త్ర జ్ఞానమావశ్యకమని తలచి తెనుగులో ప్రకృతి శాస్త్రములు లేకుండుట విచారించి యా లోపమును

సాధ్యమైనంతవరకు బోగొట్టవలెనన్న యుద్దేశముతో పదార్థ వివేచన శాస్త్రమును ప్రశ్నోత్తరరూపమున తెనిగించి ప్రకటించుచుంటిని.

- స్వీ.చ.రెం.భా.పు. 218

తామే సర్వజ్ఞులమన్న గర్వమును తామితరులవల్ల నేర్చుకొన్నచో గౌరవ లోపమను దురభిమానమును గలవారెప్పుడును వృద్ధినొందక క్రమక్రమముగా క్షీణ దశకు వత్తురు.

కాబట్టి పురోభివృద్ధి గోరువారు తాము సత్యమును సర్వవిధముల సంపాదింప ప్రయత్నించుచు మంచియెందున్నను గ్రహించుచుండవలెను.

పైని జెప్పిన దురభిమానము మనదేశమునందు ప్రబలి సర్వమును మన శాస్త్రములలోనే యున్నదనియు మన మితరులవలన నేర్చుకోవలసిన దేదియులేద నియు దురభిప్రాయము బలపడ నారంభించినది మొదలు శాస్త్రజ్ఞానమంతకంతకు వృద్ధినొందక క్రమక్రమముగా క్షీణదశకు వచ్చుచు నదకిప్పటి హీనస్థితికి వచ్చినది.

- స్వీ. చ. రెం. భా. పు. 222

పూర్వపు వారక్కడక్కడ సముచితముగా శబ్దాలంకారములను జేర్చుచు వచ్చినను భాషావధూటికి ప్రాణమైన యర్థసామరస్యమును జెడగొట్టకుండిరి. ఇటీవలి వారర్థసారస్యము నంతగా బాటింపక నిఘంటువులను వెదకి పదములేరికూర్చి బంధించి తమ సరస్వతిని హృదయాకర్షకము కాకపోయినను కర్ణరసాయనముగా నైనను జేయపాటుపడిరి. ఇట్టివారిలో నెన్నికగన్న కొందరు బంధాదుల నతిమాత్ర ముగా జేర్చి యర్థసారస్యమును బూర్ణముగా జెరిచి యవయవములు విరిచి తమ భాషావధూటిని శవప్రాయను జేసిరి.

- కవు.

మనలో బాలురు చదువుకొనుట కనుకూలములగు పుస్తకములు సహితము దేశభాషలయందు కావలసినన్ని లేవు.

- వివే. 1881

నీతి బోధకములగు పుస్తకములను చరిత్రములను ప్రకృతి శాస్త్రములను కృషి శాస్త్రాదులను దేశభాషలలో సులభశైలిని వచనరూపమున వ్రాయించుట ముఖ్యకర్తవ్యము.

ఇట్టి పనియొక్కరి వలన నెరవేరదగినది కాదు. పలువురు సంఘీభవించి చేయవలసియుండును.

- విచే. 1881

జనసామాన్యములోనే సదాచారమును ప్రతిష్ఠింపవలయు నన్నను ముందుగా జనులలో విద్యాభివృద్ధి కలిగించు ప్రయత్నము చేయవలయును.

- వి.వే. 1881

దేశాభివృద్ధి యనగా దేశమునందలి జనుల యభివృద్ధియేకాని వేరుకాదు. నిక్కమయిన దేశాభిమానము గలవారి కందరికిని జనులయొక్క స్థితిని బాగు చేయుటకై ప్రయత్నముచేయుట విధి.

- విచే. 1881

మన పూర్వులలోని కొందరి మహానుభావుల యనుగ్రహమువలన మన దేశములో లెక్కలేని జాతిభేదము లేర్పడి నానాటికి జనులలో పరస్పర ద్వేషము ప్రబలుచుండుటవలన హిందూ దేశమున నిప్పుడు దేశాభిమానమే బొత్తిగా చచ్చి పోయినది.

- విచే. 1881

ఒకతెగవారు మాత్రమే సర్వోత్కృష్టులుగా నుండి వారు స్వప్రయోజన మునకయి తక్కిన తెగలవారిని ప్రబలనీయక హీనదశయందుంచుచున్నంతవరకును దేశమునకు నిజమయిన యభివృద్ధి కలుగదు.

జనులు చదువుకొన్న వారగుదురేని తమకుగల స్వాతంత్ర్యములను తెలిసి కొని వానిని పొందుటకయి ప్రయత్నము చేయుదురు. నీచముగా నెల్లవారికిని బెదరి యొదిగి యుండక వారు చేసెడు పని క్రమమయినదో యక్రమమయినదో యాలో చించుకొను చుందురు.

- విచే. 1881

దేశభాషలు వృద్ధి పొందినంగాని దేశముయొక్క స్థితి యెన్నటికిని బాగుపడ నేరదు.

రాజకీయ భాష యెంత యభివృద్ధిగాంచినను, అది యెన్నటికిని దేశభాష కాజాలదు. జనసామాన్యముయొక్క స్థితిని బాగుపరచవలెనన్నచో తప్పక దేశభాష

లలో నుపయుక్తములయిన గ్రంథములను సులభశైలిని వ్రాసి యవి యెల్ల వారికిని సుబోధములగునట్లును సులభ క్రియసాధ్యములగునట్లును చేయవలయును.

ఏమికాలకర్మ దోషముననోగాని మనదేశమునందు హూణభాషయందు విశేష పాండిత్యము గలిగి బహుపరీక్షలిచ్చి మెప్పుబడసిన వారెవ్వరును దేశభాష యందు మంచి పుస్తకములను వ్రాసి జనసామాన్యమును మంచిదశకు తీసుకొని వచ్చుటకించుకయు ప్రయత్నింపకున్నారు.

- వివే. 1881

అన్నదానము కంటె విద్యాదానమును నౌషధ దానమును నుత్తమములే యయినను ఏమి కాలకర్మ దోషముననోగాని మన దేశమునందన్న ప్రదాతలు మాత్రమే మిక్కిలి గౌరవింపబడుచున్నారుగాని పైరెండు దానములను జేయు వారంత గొప్పగా నెంచబడుచుండలేదు.

- వివే. 1881

జనులలో విద్యాభివృద్ధి చేయుటకయి దొరతనము వారిప్పుడు విశేషశ్రద్ధను పుచ్చుకొని బహు గ్రామములయందు పాఠశాలలను స్థాపించుచున్నారు. కాని జను లను దగ్గరనుండి ప్రోత్సాహపరచి పిల్లలను పాఠశాలలకు పంపునట్లు చేయుట కయి విశేష శ్రద్ధను పుచ్చుకొనువారు లేక బహుస్థలములయందు పాఠశాలలు ప్రయోజన కరములుగా నుండుచుండలేదు.

జనులలోని తెలివిగల వారి తోడ్పాటులేక ప్రభుత్వము వారే కార్యమును గాని చక్కగా నిర్వహించుటకు శక్తులు కాజాలరు.

కాబట్టి విద్యాభివృద్ధి విషయమున గూడ మనవారు విశేష ప్రయత్నము చేయుట యావశ్యకము.

- వివే. 1881

బాలికా పాఠశాలలను బీదలకు పనికివచ్చు రాత్రి పాఠశాలలను గూడ బెట్టించి సర్వజనులలో మంచి విద్య వ్యాపించునట్లు చేయవలయును.

చక్కని దేశభాషా గ్రంథములు పుట్టువరకును భాషవృద్ధి చెందుచున్నదని చెప్పవలను పడదు.

భాషాభివృద్ధిని బట్టియే జనుల నాగరికతయు నభివృద్ధి చెందుచుండును.

- వివే. 1882

విద్యయందును, బుద్ధియందును నాగరికత యందును జనసామాన్యము యొక్క స్థితిబాగుపడిననే దేశాభివృద్ధియన బడునుగాని యెవ్వరో కొందరు మహోన్నత దశను పొంది తక్కిన వారు హీనదశయందున్నంతవరకును దేశాభివృద్ధి కలుగుచున్నదని యెంత మాత్రమును చెప్పవల్ల కాదు.

- వివే. 1888

ఓ విద్యానిధులారా! మీరికనైనను మిమ్మాశ్రయించియున్న మాంద్యము నుండి లేచి కన్నులు తెరిచి మీ యర్హ్యకృత్యమును తెలిసికొని మీరేమో సమస్త విధముల మహోపకారమునుచేసి తన్నావరించియున్న యజ్ఞానాంధకారము నుండియు దుర్దశల నుండియు నుద్ధరింతురని యాశపడి మీ నిమిత్తమయి కనిపెట్టుకొనియున్న దేశము యొక్క మనోరథమును సఫలము చేయుటకు ప్రయత్నింపుడు.

- వివే. 1888

మనదేశములోని విద్యార్థులలో ముప్పాతిక మూడు వీసములు తమకించుక యల్ప విద్య లభించిన తోడనే తమ తండ్రి తాతల వృత్తి నవలంబించుట తమ పరువునకు యోగ్యమయినది కాదని యోచిశ్వవృత్తికే కాచుకొని యుండి యందు విఫల మనోరథులయి యెందునకుం బనికిరాక సోమరులయి పాడగుచున్నారు.

- వివే. 1894

మనదేశములో నంత కంతకు విద్యాభివృద్ధి కావలసినంత యగుచున్నను విద్యార్థుల నీతి ప్రవర్తనము విషయమయి లేశమయినను శ్రద్ధవహించి వారిని సన్మార్గమున నడిపించుటకు తగిన సాధనముల నేమియు నాలోచించుచుండలేదు.

- వివే. 1885

ఇంగ్లీషు భాష యీ దేశములో నెంత విస్తారముగా వ్యాపించినను అది యెన్నటికిని దేశభాష కానేరదు.

రాజకీయోద్యోగముల కాశపడువారును మరికొందరు మాత్రమే యీ భాష నభ్యసింతురుగాని సర్వజను లెప్పుడు నభ్యసింపరు.

కాబట్టి జనసామాన్యమునకు జ్ఞానాభివృద్ధి కలుగవలెనన్నచో నెన్నటికైన దేశభాషల మూలముననే కలుగవలెను గాని రాజ భాష మూలమున గలుగనేరదు.

దేశభాషలెంత వృద్ధికి వచ్చునో జనుల నాగరికతయు నంతవృద్ధి నొందును.

కాబట్టి జనులను జ్ఞానులనుగాను నాగరికులనుగాను జేయవలెనన్నచో ముందుగా దేశభాషల స్థితిని బాగుచేయవలెను.

- వివే. 1886

దేశాభిమాన మనగా దేశములోని జనులమీది యభిమానమే యగుటచేత దేశాభిమానలేశముగల ప్రతిపురుషుడును తన దేశమునందలి లోపములను తెలిపి తొలగించి జనులను మంచి స్థితిలోనికి దెచ్చుటకును, గుణాధిక్య మెందున్నను గ్రహించునట్లుచేసి స్వదేశజనులు విద్యావివేకముగల వారి దృష్టియందు గౌర వార్హులగునట్లు చేయుటకును సర్వవిధముల ప్రయత్నము చేయవలయును.

- వివే. 1893

ఒక దేశముయొక్క యభివృద్ధిని పాడుచేయుటకై గర్వముతో సమాన మయిన శత్రువు లోకములో మరియేదియు లేదు.

మన పూర్వులు నిజముగా గొప్పవారేయయినను మన గొప్పతనము యిప్పటి యోగ్యతవలన రావలసినదే కాని మన పూర్వులు గొప్పవారని విఱ్ఱవీగుటవలన వించుకేనియురాదు.

పూర్వాచారములను భూషించుటయు నూతనాచారములను దూషించుటయు దేశాభిమానము కాదు.

దేశమునకు భంగకరములుగా నున్న దురాచారములను తొలగించుచు క్షేమ కరములుగా నున్న సదాచారములను నెలకొల్పుచు దేశాభివృద్ధికై పాటుపడుటయే నిజమైన దేశాభిమానము.

అనర్థదాయకమైన యాచారము మనదైనను త్యజింపవలయు ననియు శుభ కరమైన యాచార మన్యులదైనను భజింపవలయుననియు బోధించి దేశమునందు సత్యాదరమును పరోపకార బుద్ధియు ప్రబలునట్లు చేయుడు.

- వివే. 1898

జనులందరిని మూర్ఖదిశయందే యుంచి చదువుకున్న వారు నలుగురును మాత్రము చేరి సంవత్సరమున కొకసారి యెక్కడనో యొకచోట సభలు చేసి యేవో ప్రసంగములు చేసినంత మాత్రమున దేశమును ప్రయోజనము కలుగదు.

- దేశీ.

# 8. మహిళోన్నతి

నాకు మొదటి నుండియు స్త్రీ విద్యయందధికాభిమానము. స్త్రీల స్థితి బాగు బడినగాని దేశము బాగుపడదని నానమ్మకము.

గృహము మహారణ్య సదృశముగాక భూతల స్వర్గమువలె నుండగోరిన యెడల పురుషులు గృహిణులను విద్యావతులనుగాజేసి జ్ఞానదీప ప్రభావముచేత నజ్ఞాన తిమిరము తొలగించి దుర్గుణ దురాచార సర్పశార్దూల సంచారములకు వారి హృదయకుహరములందు జోటులేకుండ జేయవలెను.

- స్వీ చ. మొ.భా.పు. 29

స్త్రీల హృదయముల జ్ఞానాంధకార బంధురములయి మౌఢ్య మహారాక్షస దుష్పరిపాలనమునకు లోబడియున్నంతవరకు నానా వగుణ పిశాచము లచ్చటినుండి తొలగిపోవు.

ఒక ఇంట నూరు జుట్లిముడునుగాని రెండు కొప్పులిముడవన్న సామెత యందరు నెరిగినదేకదా. ఇద్దరాడువారొక్కచోట జేరినచో బనిలేనిపాటగా నేదో యొక విషయమున శుష్కకలహములు పొడచూపక మానవు. ఇప్పటి మన దేశపు స్త్రీలలో గానబడుచున్న ఈ కలహప్రియత్వమునకు ప్రధాన కారణము స్వప్రయోజన పరత్వముచేత దూరాలోచన మట్టుబడినవారు తమ తరుణీమణులను విద్యాగంధ విహీనురాండ్రనుగా జేయుటవలన వారి నాశ్రయించియున్న మౌఢ్యభూతావేశ దోషమేకాని సహజ కోమలమైన స్త్రీస్వభావముకాదు.

- స్వీ చ. మొ భా.పు. 29

నాకు స్త్రీ విద్యయందును స్త్రీల యభివృద్ధి యందును విశేషాభిమానము. స్త్రీల దురవస్థకు బలుమారు పరితపించి వారి దుస్థితిని దొలగింప ప్రయత్నింప వలయుననియు, స్త్రీలను ప్రస్తుత స్థితిలోనే యుంచి తాము పైకి లేచుట పురుషుల కెన్నడును సాధ్యముకాదనియు, తాము బాగుపడవలెనన్నచో వారిని గూడ విద్యా వివేకాదులయందు మంచి స్థితిలోనికి దెచ్చి వారితో గలిసియున్నత పదవికి లేవ

వలయు ననియు, తాము మాత్రమే వృద్ధినొంది వారిని నిజమైన మైత్రిక నర్హమైన దాస్యమునందే యుంచదలచిన పక్షమున దెలియకయే దినదిన క్రమమున దామున్నత పదము నారోహించుచువచ్చుటకు మారుగా నొక్కొక్క మెట్టు దిగుచు వచ్చి కడ పట వారితోగూడ నడుగంటుట యనివార్యమనియు నేను దలంచుచుండెడు వాడను.

- స్వీ.చ.రెం.భా పు. 204

స్త్రీల ప్రతిజ్ఞల యందంతకంతకు నాకు విశ్వాసమెట్లు హెచ్చుచున్నదో యట్లే ఇప్పుడిప్పుడు నా కంతకంతకు మన యౌవనపురుషుల ప్రతిజ్ఞలయందు విశ్వాసము తగ్గుచున్నది.

- స్వీ.చ రెం భా పు. 378

సతీహితబోధిని యను స్త్రీల కుపయోగించు మాసపత్రిక నొకదానిని మూడు సంవత్సరములు నడిపి స్త్రీల నిమిత్తమయి సత్యవతీ చరిత్రము, చంద్రమతీ చరిత్రము, సత్యసంజీవని, పత్నీహితసూచని, దేహారోగ్య ధర్మబోధిని మొదలగు పుస్తకములను రచించితిని.

- స్వీ.చ.మొ.భా.పు. 406

స్త్రీలు పూనుకొని తోడుపడినంగాని యే సాంఘిక సంస్కారమును సంపూర్ణ విజయము నొందనేరదు.

స్త్రీలు పూనుకొన్న యే మహాకార్యము సాఫల్యము నొందక మానదు.

ఇంటనడచు గృహకృత్యములనెల్ల జక్క బెట్టవలసిన భారము స్త్రీలది గాని పురుషులదిగాదు.

వారు చదివినవారై యున్నయెడల, ఆ కార్యములనెంత బాగుగను జాగ్రత్తగను నిర్వహింతురు? ఇప్పటి మన ముగుదలకట్టి సామర్థ్యములేక పోవుటచేతనే కదా ఇంటి బరువంతయు పురుషులమీదనే పడి పగలెల్ల వెలుపల గొలువుచేసి వచ్చి బడలియుండియు ఆ వెనుక నింటి పనిని గూడదామే విసువుతో చూచుకో వలసిన వారుగా నున్నారు?

- వివే. 1875

ఇంతులు పురుషులట్లు విద్యనేర్చిన వారైన వారి బిడ్డలును మిక్కిలి తెలివి గలవారగుదురు.

స్త్రీ విద్య మనదేశములోన నాది సిద్ధముగా నున్నదియే కాని ఈనడుమ నేడు క్రొత్తగా నెక్కడి నుండియో వచ్చి చొచ్చినదికాదు.

- వివే. 1875

ఒక్క స్త్రీ విద్యయననేల? మనదేశము మ్లేచ్ఛాక్రాంతమయి యున్నప్పుడు అడుగంటని ధర్మము లెవ్విగలవు?

మన యదృష్ట విశేషముచేత నీ యింగ్లీషు దొరతనము వల్ల నల్లనల్లన మనదేశ మెల్ల నల్లుకొని మెల్లగా కొన్నికొన్ని సద్ధర్మములు మరల తల యెత్తు చున్నవి

- వివే 1875

మనవారిలో పండితుల మనుకొనువారు కొందరు తెలిసియో తెలియకయో స్త్రీలకు విద్యవినాశహేతువనియు పూర్వాచార విరుద్ధమనియు మొట్టమొదట నెట్టెట్టో వాదించి పిదప తెలియనివారివలె తాము పట్టినపట్టే గెలువవలెనను తలంపున పామరుల నెల్ల భ్రమింప చేయుచు పోరాడుచున్నారు.

స్త్రీ విద్య శాస్త్ర నింద్యమైనది గాదు.

శ్రుతుల యందెచ్చటను స్త్రీ విద్య నిషేధింపబడి యుండలేదు.

స్త్రీ విద్య శ్రుతి స్మృతి పురాణ సమ్మతమైన దనుటకు లేశముగాని సందేహము లేదు.

వీనికి శిష్టాచారము కూడ తోడగుచున్నది.

- వివే. 1875

పిశాచములు పట్టుట మనలో నాడు వారియందే మిక్కిలి గానవచ్చుచున్నది. గాని మగవారి యందంతగా గానరాదు; నిజముగా దయ్యములే యున్న పక్షమున విశేషముగా నాడు వారినే బాధించుచుండుటకు కారణము కానరాదు. స్త్రీలకు స్వాతంత్ర్యములేమింజేసి వారి మాట చెల్లనపుడు తరచుగా బిశాచముల నెపమున బురుషుల నొడబరిచి స్త్రీలు తమ యిష్టానుసారముగా గార్యములు నడిపించుకొను చుండ మనము పెక్కుచోట్ల చూచుచున్నాము.

- వివే. 1875

పండితులనేకులు స్త్రీ విద్య హిందూ శాస్త్ర సమ్మతము కాదనియు పూర్వాచార విరుద్ధమనియు స్త్రీ విద్యాభ్యాసము వలన కీడు మూడుననియు తోచి

నట్లెల్ల వాదములు చేయనారంభించిరి కాని కడపట వారందరును విఫలమనో రథులయి స్వవాదము నుజ్జగించియూరకుండ వలసిన వారైరి.

స్త్రీ విద్యాభ్యాసమునకు వలయు పుస్తకములను గూర్చియు వానియందుండ వలసిన విషయములను గూర్చియు ముచ్చటింతము.

బహు విషయములందు స్త్రీలును పురుషులతో సమానులుగానే యున్నందున జ్ఞాన సంపాదనమున కయిపురుషులు చదివెడి గ్రంథములన్నియు స్త్రీలును చదువదగినవే,

భాషా విషయమున జ్ఞానమును వృద్ధి పరచు వ్యాకరణాదులు; వస్తు వివేచన కావశ్యకమగు గణిత శాస్త్రమును దేశకాల స్థితులను దెలుపు చరిత్రాదులను పురుషులవలె స్త్రీలచేత సహితము నభ్యసింపబడవలసినవే.

స్త్రీలు పురుషుల కంటె కొన్ని విషయములలో భిన్నరాంద్రులుగానున్నందున వారు ముఖ్యముగా నభ్యసింపవలసిన విషయములు కొన్ని యున్నవి.

కుట్టు పనిని, పాకముచేయుటను ఈ విధముగా ప్రత్యేకముగా స్త్రీలకు మాత్రమే పనికి వచ్చెడి యితర విషయములను బోధించెడి పుస్తకములను వార వశ్యముగా నభ్యసింపవలయును.

స్త్రీలకు వైద్య విషయము తెలిసి యుండుట యత్యంతావశ్యకము. భూమి మీద పుట్టినప్పటి నుండియు బిడ్డలను పెంచి సంరక్షింపవలసిన భారమంతయు స్త్రీలదయియే యుండును.

స్త్రీలు చదివెడి గ్రంథములు వట్టి కల్పనా కథలవలె నుండక సులభశైలిని వ్రాయబడి స్వాభావికమయిన జీవచరిత్రమువలె నుండు వచన గ్రంథములుగా నుండ వలెను.

మనలోని జమీందారులును ధనికులును అట్లు వ్రాయబడిన ప్రతి పుస్తకము నకును కొన్ని వందల రూపాయలిచ్చుటకు పూనుకొనెడి పక్షమున శీఘ్ర కాలములోనే బాలికల కుపయోగించు వచన పుస్తకములు కొన్ని బయలుదేర వచ్చును. మేమును సాధ్యమయినంత శీఘ్రముగా నొక గ్రంథమును వ్రాయ నుద్యుక్తులమయియున్నారము. లోకోపకారధురీణులయిన పండితులెవ్వరయిన నిట్టి ఘన కార్యమునకు పూనుకొని వచన గ్రంథములను వ్రాయదొరకొనినచో

అట్టి విసులభ శైలిని చక్కగా నుండునేని మా వివేకవర్ధని ప్రతివారమును కొంత కొంత ప్రకటింపగలదు.

- వివే. 1880

విద్యవలన స్త్రీలకు పెక్కు ప్రయోజనములు గలవు. మొట్ట మొదట విద్య వలన తెలివిగలుగును. గృహకృత్య నిర్వహణము నందును తెలివి ముఖ్యముగా కావలసియే యుండునుగాన స్త్రీలు చదివిన వారగుదురేని ఇంటిపనులను వారు మిక్కిలి పొదుపుగాను జాగ్రత్తతోను నిర్వహింతురు.

తమ బిడ్డలను విద్యాబుద్ధులను నేర్పి సత్ప్రవర్తనము గల వారినిగా జేయుటయే కాక వారు పాఠశాలయందు చదువుకొన్న వానిని పరీక్షించి శిక్షించు చుందురు.

ఇప్పటి మన వారు కొందరు స్త్రీలకు విద్యకూడదనియు వారు చదివినచో చెడిపోదురనియు వారు చదివి యుద్యోగములు చేయబోయెదరాయనియు వాదము చేయుట చూడ మిక్కిలి యాశ్చర్యకరముగా నున్నది.

స్త్రీలను పురుషులతో సమానముగా గౌరవించుచున్నంతకాలమును మనదేశ మెంతో యున్నత స్థితియందే యుండినది. అట్లు గౌరవించుటమాని విద్య చెప్పించుట వదిలివేసి వారిని దాసీజనులవలె జూడ మొదలుపెట్టిన తరువాతనే మనదేశమున కిట్టి దౌర్భాగ్య దశయారంభమయినది.

మను స్మృతియందు శుభమును గోరు జనకులును సోదరులును పెని మిటియు మరుదులును స్త్రీలను గౌరవింపవలెనని విధింపబడియున్నది.

స్త్రీలు తమ పురుషుల కాలోచన చెప్పుటయందు మంత్రులవంటి వారయి యుండవలయునని స్మృతులు ఘోషించుచుండుటచేత వారి యెడల గౌరవముంచి వారి యాలోచనలను గణ్యతలోనికి దెచ్చుట పురుషుల విధియని వేరుగ జెప్ప నక్కర యుండదు.

మనదేశమునందు స్త్రీ విద్య నశింప మొదలుపెట్టిన తోడనే వారి యెడగల గౌరవమును క్షీణింప మొదలుపెట్టినదని యూహింపదగి యున్నది.

మనస్మృతులు స్త్రీలను పూజ్యురాండ్రని బోధించుచుండగా స్మృతికర్తల కన్నను బుద్ధిమంతుల మనుకొన్న పౌరాణికులును మరి కొందరును స్త్రీలను నమ్మ

గూడదనియు వారు సహజముగా దుర్మార్గురాండ్రనియు వారు గౌరవమునకు దగని వారనియు మనసు వచ్చినట్లెల్లను వ్రాసియున్నారు. ఆ పిచ్చివ్రాతల నేమియు పాటిగా బట్టక మనవారు స్త్రీలకు మంచి విద్యను జెప్పించి వివేకవతులురాండ్రనుగా జేసి, వారి యాలోచనను సహితము తగిన విషయములం దంగీకరించి వారిని గౌరవించుచు మన పూర్వులు పొందియుండిన మహోన్నత దశను మరల పొందుట కయి ప్రయత్నింతురని మరి మరి కోరుచున్నాము.

- వివే. 1880

పురుషుడెంత విద్యావంతుడయి నాగరకుడయి క్రూరములయిన యాచారముల నెన్నిటిని మాన్పదలచుకొన్నవాడయ్యును ఇంట స్త్రీలు విద్యాగంధములేమిచే మంచి చెడ్డలు తెలియక మూర్ఖాచారముచే యెన్ని చెప్పినను మానక యాచరించుచు వచ్చుటవలన నాతడుచేయు సత్ప్రయత్నము లేమియు సాగక లోపల నెంత యాలోచన యున్నను పయికి మూర్ఖులతో సమానముగానే ప్రవర్తింపవలసిన వాడగుచున్నాడు.

స్త్రీలు మంచి విద్యనేర్చిన వారయిరేని సమస్త సత్కార్యములయందును పురుషులకు తోడుపడి మంచి యాలోచన చెప్పుచు సహాయురాండ్రగుటయేకాక బిడ్డలను సహితము మొదటినుండియు సన్మార్గమునకు ద్రిప్పి వారి దేహారోగ్యాదుల విషయమయి మంచి శ్రద్ధను పుచ్చుకొనుచు గృహకృత్య నిర్వహణమునందు పురుషులకేమియు శ్రమనీయక కలహములు మాని ఇల్లొక స్వర్గముగా నుండునట్లు చేయుదురు.

అట్టి విద్యావతులును గుణవతులునగు భార్యలను తోడబుట్టిన పడుచులను తల్లులను కూతులనుగల వారి భాగ్యమే భాగ్యము అట్టివారే యీ లోకమున సుఖులని చెప్పదగినవారు.

కాబట్టి యెల్లవారును స్త్రీ విద్యాభివృద్ధి చేయుటకయి తమ శక్తివంతను వినియోగింపవలయును.

- వివే. 1881

దేశాభివృద్ధిని జేయదలంపుగొన్నవారు ముందుగా తమ గృహమునందలి వారిని తరువాత వితరులను వివేకులనుగాజేయ పాటుపడవలయును. ఇంటగల

వారిలో స్త్రీలు ముఖ్యులు. వారి స్థితి బాగుపడిననేగాని పురుషుల స్థితి బాగుపడనేరదు.

పురుషుడెంత చదువుకొన్న వాడైనను బయలనెంత గౌరవము పడయు వాడయినను ఇంట భార్య విద్యాగంధ మెరుగని మూఢ స్త్రీయయ్యేనేని పరస్పరము మనస్సు కలియకపోవుటచేత నిజమైన సౌఖ్యమేమియుగలుగదు.

భార్యలు విద్యా విహీనురాండ్రగుట చేతనే పాఠశాలలయందు జదువుకొని గొప్ప పరీక్షలయందు కృతార్థులయి యెన్నియో మంచి మార్పులను చేయవలెనని కోరిక గలిగి పనిచేయువారు సహితము తమ యింటనే యొక్క మార్పునయినను జేయలేక నిరుత్సాహులగుచున్నారు. కాబట్టి యెల్లవారును స్త్రీ విద్యాభివృద్ధికయి చేతనైనంత పనిచేయవలెను.

- వివే. 1881

భార్యభర్తల మనసొక్కటి యయినంగాని వారికి పరస్పరానురాగమును నిజమయిన సుఖమును గలుగవు.

తెలివిగల వారికిని తెలివిలేని వారికిని మైత్రి యెప్పుడును కలుగనేరదు గనుక విద్యావంతులు తమ భార్యలను గూడ విద్యావతులనుగా జేయుటకయి సర్వ విధముల పాటుపడవలయును.

- వివే. 1881

ఒక్క పురుషులు మాత్రము మంచి స్థితికి వచ్చి స్త్రీలు యథా స్థితిలోనే యున్న యెడల నిజమైన యభివృద్ధి యెంత మాత్రమును కలుగనేరదు. కాబట్టి పురుషులతోపాటుగా స్త్రీలకును సువిద్యాదులను నేర్పవలయును.

తమ యింటనున్న స్త్రీలకు విద్య నేర్పనివారు బాలికాపాఠశాలలను స్థాపింప వలయునని యుపన్యాసములు చేయుచు వచ్చినచో వారి శుష్కవచనముల యందెవరికి గౌరవముండును?

దేశాభిమానముగల వారందరును గృహమున తమ తోడబుట్టువులను భార్యలను తల్లులను మొదలగు వారిని విద్యావంతులను జేయవలెను. ఎంత తీరిక లేని వారును దినమునకొక రెండు గడియల కాలమును తమ యింట గలవారినుల యభివృద్ధి విషయమయి గడప వచ్చును.

- వివే. 1882

గొప్ప పట్టణములు కొన్నిటియందు బాలురకువలెనే బాలికలకును విద్య చెప్పింపవలయునని పలువురు తలచినను పల్లెల యందింకను స్త్రీ విద్య శాస్త్ర దూష్యమనియు అనర్థదాయక మనియు భ్రమించి పలువురు ప్రతిపక్షులుగా కూడ నున్నారు.

పంద్రెండు సంవత్సరములు దాటిన పడచులు చదువు వదిలిపెట్టక యున్న యెడల పాఠశాలయందున్నంత కాలమును వారికి ప్రతిమాసమును బహుమాన వేతనముగా కొంత ఇచ్చుచుండవలయునని యెడ్యుకేషన్ కమిషన్ వారేర్పచిన పథక మెంతయు ననుకూల మయినదని భావించుచున్నాము.

స్త్రీలకు ప్రత్యేకముగా నుపయోగించు పుస్తకములు లేకపోవుట గూడ కొంతవరకు వారి విద్యాభివృద్ధికి ప్రతిబంధకముగా నున్నది.

- వివే. 884

క్రిందటి సంవత్సరమువరకు మన చెన్నపురి రాజధానితో జేరిన దేశముల యందెల్లను 552 బాలికాపాఠశాలలుండినవి. వానిలో 35048 బాలికలు చదువు చుండిరి.

బొంబాయి రాజధాని కింది దేశములలో 343 బాలికాపాఠశాలలు మాత్రమే యుండినవి. వానిలో 26 266 గురు బాలికలు చదువుచుండిరి.

బంగాళమునందు 1015 బాలికాపాఠశాలలుండి వానిలో 413349 గురు బాలికలు చదువుచుండిరి. ఈ ప్రకారముగానే పాంచాలము మొదలయిన దేశముల యందు గూడ ననేక బాలికాపాఠశాలలుండి బాలిక లెందరో చదువుచున్నారు.

మొత్తము మీద మన హిందూ దేశమునందున్న బాలికల పాఠశాలలన్నియు 3697. వానిలో చదువుకొను బాలికలందరును. 127066 గురు.

ఇన్ని పాఠశాలలుండి ఇంతమంది చదువుచున్నను చదువుటకు తగిన ఈడులోనున్న బాలికలలో నూటిలో నొక్కరయినను చదువుచుండలేదు.

బంగాళమునందువలె గొప్ప పరీక్షలిచ్చిన స్త్రీలు మన దేశమున నొక్కరును లేరు. ఆ లోపము సహితము అచిర కాలములోనే పోగొట్టుట కీశ్వరుని వేడు చున్నాము.

- వివే. 1884

కన్యను మరణ పర్యంతము వివాహము చేయకుండనైన నుంచవచ్చును గాని గుణహీనునికి మాత్ర మెప్పుడును నియ్యకూడదని మనువు విధించి యున్నాడు

– వివే. 1884

బయటి బాధ యెంతయినను సహింపగలిగి యుందురు కాని సదాయింట నుండు బాధను సహించుట కెంతటి ధైర్యశాలులకు సాధారణముగా సాధ్యము కాదు.

స్త్రీల మేలుకొరకే పనిచేయుచున్న విషయములో కూడ స్త్రీలేల ప్రతిబంధ కారిణులుగా నున్నారని విచారింపగా ఈ యనర్థమున కంతకును వారి మూర్ఖత్వము తప్ప మరియొక కారణము నూహించుటకు మేము శక్తులము కాకున్నాము.

మూర్ఖత్వ మెక్కడ నధికముగ నుండునో యక్కడ నెల్లను స్వప్రయోజన పరత్వము సహిత మధికముగానే యుండును.

ఆ స్వప్రయోజన పరత్వము చేత తోడివారు దుస్సహ దుఃఖముల ననుభ వించుచున్నను జాలిలేక వారి కష్టములను వారింపవలెనని లేశమయినను ప్రయ త్నింపక మన స్త్రీలు హృదయము రాయిచేసి కొనియుందురు.

స్వార్థపరత్వమును వారి మనసుల నుండి పారద్రోలువరకును వారికి పరోపకార శీలతకలిగి వారు విద్యాధికులయిన తమ పురుషులతో సత్కార్యా చరణము నందేకీభవించి వారికి తోడుపడ జాలరు.

స్వప్రయోజన పరత్వమును తొలగించుటకును యుక్తాయుక్త వివేకము కలి గించుటకును మనము ముఖ్యముగా సాధ్యమయినంత విద్యాబలమును మన స్త్రీలకు కలుగ జేయవలెను.

– వివే. 1885.

స్త్రీ విద్యయే యనుకూల దాంపత్యమునకు ముఖ్యమైనది. స్త్రీయే సౌఖ్య మునకును ప్రతిష్ఠకును ముఖ్య కారణము. అట్టి స్త్రీ రత్నములకు విద్యాగంధ ముండిన నెంత రాణించును! బంగారమునకు పరిమళ మబ్బినట్లే యుండునుగదా!

అన్ని సౌఖ్యములకును ముఖ్యకారణమైన స్త్రీ విద్యయే కారణము చేతనో కాలక్రమమున నీ దేశమున నశించి స్త్రీ విద్య యశుభదాయకంబను స్థితికి వచ్చినది.

కాని ఇప్పుడిప్పుడు కొందరు బుద్ధిమంతులు ప్రయత్నముచేసి కొంతవరకు నెండి పోయిన స్త్రీ విద్యావృక్షమును మరల చిగిరింపజేయ ప్రయత్నించుచున్నారు.

– వివే. 1887

కన్యాశుల్కమువలెనే వరదక్షిణయని పేరు పెట్టి మనలోని చదువుకొన్న వారు కన్యల సంరక్షకులవలన బేరమాడి బలవంతముగా పుచ్చుకొనెడి వరశుల్కము దూష్యమైనదగుటకు సందేహము లేదు. బాల్య వివాహములను మాన్పి వితంతువివాహములను నెలకొల్పి స్త్రీ విద్యను వ్యాపింపజేసినచో వరశుల్క కన్యాశుల్కరూపములయిన ఈ రెండు దురాచారములును నామమాత్రా వశిష్టములు కావచ్చును.

– గోదా.

స్త్రీ పురుషులిద్దరును గలసి యేకదేహమని ఘోషమిడుచున్నప్పుడు పురుషుల విద్యాభివృద్ధి నిమిత్తమయి శ్రద్ధవహించుచు స్త్రీల విద్యాభివృద్ధి నిమిత్తమయి యుపేక్ష చేయుట యేకదేహములో నర్ధభాగమును మనుష్యునిగాజేసి తక్కిన యర్ధ భాగమును మృగమునుగా నుంచుటయే కాని వేరు కాదు.

– గోదా.

స్త్రీలు విద్యావతులు కానంతవరకు మనదేశము బాగుపడదు. మన యభివృద్ధి యంతయు స్త్రీల యభివృద్ధిలోనే యున్నది.

మనతో సమానముగా స్త్రీలకు విద్య చెప్పించి వారితో గలసి మన మూర్ధ్వగతికైనను బోవలెను. లేదా వారిని మూఢ దశయందుంచి వారితో గలిసి మన మధోగతికైన బోవలెను. ఈ రెంటికంటెను మనకు వేరుగతి లేదు.

– గోదా.

స్త్రీలను విద్యావతులనుగా జేసినచో వారు సమస్త సత్కార్యములయందును మనతో నేకీభవించి మన పురోభివృద్ధిలో సహాయురాండ్రగుదురు.

– గోదా.

దుఃఖ బహుళమయిన ఈ లోకములో వివాహ బంధమువలని సుఖ మనుభవించునప్పుడే స్వగృహము భూతల స్వర్గమువలె నుండును. అది లేనప్పుడు దివ్య మందిరములు మహారణ్య సదృశములుగా నుండి జీవనమే దుర్భరముగా నుండును. లోకములో మనుష్యుల సుఖ మంతయు నితరేతర సంబంధమువలనను అన్యోన్య

సాహాయ్యము వలనను పరస్పర బాంధవ్యమువలనను కాని యెవ్వరి సంబంధమును లేక యేకాకిగా నుండువాని కే సుఖమును లేదు ఈ పరస్పర సంబంధములకును ప్రజాభివృద్ధికిని యోగక్షేమములకును సుఖ సంతోషములకును నిదానమయినది వివాహబంధము.

- పున.

తల్లులు మూర్ఖురాండ్రయి గయ్యాళి గంపలయిన యెడల బిడ్డలు చదువు తిన్నగా రాక మూర్ఖులయి దుర్మార్గులయి చెడిపోయి కడపట తాము దుఃఖముల పాలయి తమ వారికి కూడ దుఃఖమును తెచ్చిపెట్టుదురు.

- సతీ.

పురుషులు స్త్రీలను గదులలో పెట్టి తాళమువేసి కావలియుంచి నిరోధించుట వలన పాతివ్రత్యమును రక్షింపజాలరనియు స్త్రీలకు విద్యావివేకాదులు కలిగించి వారి యాత్మలను వారు కాపాడుకొనునట్లు చేసిననే రక్షణము కలుగుననియు మనువు స్పష్టముగా కనపరచి యున్నాడు.

- సతీ

స్త్రీలకు విద్యయు వినయాది సద్గుణములును అలంకారములుగాని అవిలేవి లోహమయములును మణిఖచితములు నయిన నగలలంకారములు కావు.

- సతీ.

ఏమి పాపమోకాని మనదేశమునందు సాధారణముగా అత్తలు తాము కోడండ్ర నెంత బాధపెట్టిన తమకంత ప్రతిష్ఠగా భావించుకొనుచున్నారు. కోడండ్రు తమ తల్లిదండ్రులను బంధువులను వదలిపెట్టి భర్తల ఇంట సుఖపడవలెనని కొండంత యాశపెట్టుకొని వచ్చిరనియు అందుచేత వారికేమియు మనస్తాపము కలుగకుండ బిడ్డలవలె నాదరింపవలయు ననియు తలంచరు.

-- సతీ. 1883

చదువెరుగని స్త్రీలు తమ బిడ్డలకు శత్రువులు.

స్త్రీలు చదివి వివేకము గలవారయిన పక్షమున తామెప్పుడును పరుష వాక్యములను తిట్లను నోటరానియ్యక యెవ్వరితోను కలహము పెట్టుకొనక శాంతత గలవారయి మంచి నడవడిక గలవారయి యుందురు.

తల్లిబాలు పిల్లలకు వచ్చునన్న సామెత ప్రకారముగా తల్లి మంచిదగుట వలన బిడ్డలును మంచి నడతగలవారయి అందరకును ముద్దుగా నుందురు.

- సతి. 1883

మనలో స్త్రీలు సాధారణముగా స్వల్ప తప్పిదమునకు గూడ బిడ్డలను నోట పట్టరాని తిట్లను తిట్టి పశువును బాదినట్టు బాదుదురు. ఒకానొకప్పుడు తమ కితరుల మీద కోపము వచ్చినప్పుడు నిష్కారణముగా తమ కోపమునంతను నిరపరాధు లయిన బిడ్డలమీద చూపి వారిని కొట్టి తిట్టుదురు. అట్లుచేయుటవలన బిడ్డలు చెడి పోవుటయేకాక పాపము కూడ సంభవించును.

- సతి 883

సభలకుపోయి పాడపోయెదరా కులాంగనలకు సంగీత మెందుకని కొంద రభిప్రాయపడి యుందురు. అది సరికాదు సంసారభారముమీద పడి యందు మూలమున పెక్కు కష్టములును మనోవ్యాకులతలు సంభవించినప్పుడు మనస్సున కుల్లాసము పుట్టించి యసారమయిన సంసారమును సారవంతముగా జేయు శక్తి సంగీతమునందు దప్ప మరి దేనియందును లేదు. లోకములో నొక్కొక్క విషయ మొక్కొక్కరికి రుచించునుగాని సంగీతము మాత్ర మందరికిని రుచించును.

- సతి. 1883-84

ఈ భరతఖండమందిప్పుడున్న స్త్రీలస్థితికిని పూర్వకాలమునందుండిన స్త్రీల స్థితికిని మిక్కిలి వ్యత్యాసము కలదు. పూర్వకాలము నందలి సుందరులు విద్యల యందును కళలయందును పాండిత్యము కలవారయి పురుషుల కుపదేశము చేయదగినంత మంచి దశయందు గూడ నుండుచు వచ్చిరి.

- సతి. 1888

స్త్రీలకు విద్య కావలయునా యని సంశయపడునంత దురవస్థ మనదేశమున కిప్పుడు పట్టినది. స్త్రీలు విద్యావిహీను రాండ్రగుటచే మూఢత్వములో మునిగి యుండి సంసారభారమును నిర్వహించుటలో పురుషులకు సహాయురాండ్రు కాజాలకున్నారు.

ఏ విషయమందైనను స్త్రీల నాలోచన యడుగుట యే యనర్థదాయకమని సామాన్యముగా పురుషులిప్పుడు భావించుచున్నారు.

ఏ కాలమునందును ఏ దేశమునందును తమ స్త్రీలను మంచి దశకు తీసి కొని రాక తాము బాగుపడిన పురుషులు లేరు.

స్త్రీల యభివృద్ధి నిమిత్తమయి యక్కడక్కడ నుత్తమ పురుషులు చేయు ప్రయత్నములకు మూఢతా పిశాచావేశముచేత స్త్రీలే ప్రతిబంధ కారిణులగుచున్నారు.

ఇంటి వద్ద స్త్రీల సాహాయ్యమున్నం గాని కులాచార మతాచార విషయముల యందు పూర్వాచారములకు విరుద్ధములయిన నూతన సదాచారములను నెలకొలు పుట పురుషులకు సాధ్యముకాదు.

– సతీ. 1888

భార్య గృహమునందు రాజీ; గృహకృత్యములను విచారించి పాలించి కుటుంబమును సుఖపెట్టుట యామెకు పరమధర్మము. ఆమె భర్తకు సమస్త సత్కార్యముల యందును సహాయురాలుగాను హితబోధకురాలుగాను నుండవలెను; బిడ్డలకు విద్యా బుద్ధులు చెప్పి కాపాడు సన్మాతగా నుండవలెను.

కుటుంబమున కుత్సాహమును సంతోషమును నాగరికతను వృద్ధిపరచు ప్రౌఢురాలుగా నుండవలెను.

ఈ గుణములు విద్యాభ్యాసములేక పట్టుపడవు.

కాబట్టి కుటుంబములయందు సంపూర్ణ సుఖమును నెమ్మది గలిగింపదలచిన యెడల స్త్రీలకు యుక్తాయుక్త పరిజ్ఞానము కలిగించెడు సద్విద్యను చెప్పింపవలెను.

ఎఱ్ఱని తోలును గుండ్రని ముఖమును వస్త్రాభరణములును తప్ప వేరు యోగ్యతలులేని చిత్రపు ప్రతిమవంటి భార్య వివేకియైన భర్త కెవ్వనికి సంతోష జనకముగా నుండును.

జ్ఞానశోభయు నీతిభూషణములును లేని మానవరూపమే రసికున కాహ్లాద కరముగా తోచును.

పురుషునకు గావలసినది సుఖ దుఃఖములయందు సహధర్మచారిణిగా నుండి సఖ్యమున కర్తురాలయిన వివేకురాలుకాని చూచుకొని సంతోషించుటకయి చిత్రపు బొమ్మ వంటి రూపముకాదు.

– సతీ. 1888

స్వతంత్రులాండ్రు కాక పోవుట మొదలయిన కారణములవలన స్త్రీలకీ లోకములో కష్టములధికముగా నుండును గాన సహనము మొదలయినవి వారి యందధికముగా నుండవలెను.

- సతీ. 1889

జ్ఞానాభివృద్ధికి హేతుభూతమయిన విద్య పురుషులకెట్లో స్త్రీలకు నట్లే పరమ ప్రయోజనకరముగా నుండుననుటకు సందేహములేదు.

జ్ఞాననేత్రమునకు దోడుపాటుగా నుండు విద్యవలన పురుషులకు మేలును స్త్రీలకు గీడును గలుగునని వాదించుట బాహ్యనేత్రమునకు దోడుపాటుగా నున్న వెలుతురు పురుషులకు ప్రయోజనకరమును స్త్రీల కనర్థ ప్రదమును నని వాదించుట వంటిదే కాని వేరుగాదు.

- చంద్ర.

భార్య యోగ్యురాలయిన పక్షమున భర్తకు మహారణ్యమయినను దివ్య భవనముగా నుండుటయు, అయోగ్యురాలైన యెడల సుందరమందిరమైనను పెద్ద యడవివలె నుండుటయు సహజము.

- చంద్ర.

# 9. సాహిత్య ప్రయోజనం

నే నేర్పరచుకొన్న భాషాభివృద్ధిమార్గము తెలుగు భాషలో మృదువైన సులభ శైలిని సలక్షణమైన వచన రచన చేయుట.

స్వీ.చ. మొ భా.పు. 79

ఇటువంటి రూపకములను బ్రదర్శించుటకదియే మొదలయినందున నూరుల కొలది జనులు వచ్చి చూచి యానందించిరి, ఇట్టి నాటక ప్రదర్శనములవలన జనులకు వినోదము కలుగుటయే కాక యక్రమములు చేయువారు సిగ్గుపడి తమ ప్రవర్తనమును దిద్దుకొనుటయు నందువలన నీతి వర్ధిల్లుటయు గలుగునుగాన క్రొత్త నాటకములను జేసి నాటక సమాజము నొకదానిని స్థాపింపవలసినదని నా మిత్రు లనేకులు నన్ను గోరిరి.

స్వీ.చ.మొ.భా.పు. 169

నేను శృంగార ప్రబంధముల కామోదింపను. ఇప్పుడీ పద్య కావ్యమును రచింపవలసియుండిన యెడలనే నిట్టి శృంగార కావ్యమును రచియించియుండను. ఇప్పుడు కూర్పబడుచున్న నా సంపుటములలో నా చిన్నతనపు పద్య కావ్యముల లోని మృదువు తప్పిన వాక్యములను పద్యములను దీసివేయుచున్నాను.

స్వీ చ.రెం భా.పు. 148

తెనుగులో పద్యకావ్యములకంటె వచన కావ్యములను వ్రాయుట యెక్కువ యుపయోగకరమని నాకు తోచినది. ఈయాలోచన మనస్సులో పుట్టగానే నా కాలమును వచనకావ్య రచనయం దుపయోగించవలెనని నిశ్చయించుకొని సగము సగము వ్రాసియున్న పద్యకావ్యములను విడిచి నీతి చంద్రిక యుత్త రార్థమును పూరించుటకుపక్రమించి విగ్రహమును వ్రాసి ముగించితిని.

స్వీ.చ.రెం భా.పు. 158

మనలోగల మూఢ విశ్వాసములను పోగొట్టవలెనన్న ముఖ్యోద్దేశముతో నేను రాజశేఖర చరిత్రమును వ్రాసితిని.

– స్వీ.చ.రెం భా.పు. 159

ఇంచుమించుగా తెలుగుభాషలో నున్న ప్రబంధములన్నియు కామినీ కచకుచ సంభోగాది వర్ణనలతో నిండియుండి యేకరీతిగా నుండుట చేతను, అట్టి ప్రబంధములను రచించిన వారిలోనే నొక్కడనైనను నాకు వెనుకటి యభిప్రాయములు మారి శృంగార ప్రబంధములు చేయు మేఱ కంటె కీడెక్కువగా నుండు నన్న సిద్ధాంతమునకు వచ్చిన వాడనగుటచేత ప్రబంధ ప్రణీతృపథమును పరిహ పింపవలెనన్న యుద్దేశముతో సభాగ్యోపాఖ్యానము చేసితిని.

- స్వీ.చ.రెం.భా.పు 168

భాషవలని ప్రయోజనమేమి? జనులు తమ యభిప్రాయముల నొండొరులకు దెలుపుకొనుట. భాషలోని గ్రంథములవలని ప్రయోజనమేమి? తమ భావములను దూరమున నున్న వారికిని రాబోవు తరముల వారికిని సులభముగా తెలుపుట.

గ్రంథము లెట్లుండవలయును? అందరికి దెలియునట్లు సులభముగా నుండవలెను.

- స్వీ.చ.రెం.భా.పు. 173

గ్రంథములను సాధారణముగా సలక్షణమైన సులభశైలిని రచియింప వలెననియే నా యభిప్రాయమైనను విషయానుగుణముగా తత్తదుచిత రీతిని గ్రామ్య భాషయందు సహితము గ్రంథములను వ్రాయవచ్చునని కూడ నాయభిప్రాయము.

- స్వీ చ.రెం భా.పు. 174

పూర్వ వ్యాకరణము లన్నియు బద్యకావ్యరచన కొరకే వచన కావ్యములు లేని కాలములో పుట్టినవగుటచేత నందలి లక్షణము లనేకములు వచన కావ్యాభి వృద్ధికి తగవనియు నిప్పటి కాలమునకు దగినట్టుగా వ్యాకరణమును మార్చుకో వలయుననియు నేననుకొని ఈ కాలమునకును వచన రచనాభివృద్ధికిని తగినట్టుగా నొక నూతన వ్యాకరణమును వ్రాసి దానికి లక్ష్యముగా నొక వచన కావ్యమును జేయవలెనని పలుమారు దలపోసితిని.

- స్వీ చ.రెం భా.పు. 175

ఈ గ్రంథమును (బ్రాహ్మ వివాహమును) నేను కేవల వినోదము కొరకు మాత్రమే కాక యతి బాల్య వివాహము వృద్ధ వివాహము కన్యాశుల్కము మొద

లైన దురాచారములవలని యనర్థకములను జూపి జనులను వాని నుండి విముఖులను జేయు తలంపుతో గూడ వ్రాసితిని.

- స్వీ.చ.రెం.భా.పు. 175

సులభ వచన రచనా విషయమయి ఇతరుల మాటలను పాటిచేయక నా నూతన మార్గానుసారముగా సంభాషణ రూపమున బ్రహ్మ వివాహమును వ్రాసి హాస్య సంజీవని మొదటి ప్రతికలో కొంత భాగమును ప్రకటించితిని.

ఆ వరకు సంభాషణ రూపమున పుస్తకములు లేకపోవుట చేతనో, అందలి విషయ నూతనత్వము చేతనో పురుషులు స్త్రీలును పండితులును పామరులును బాలురును వృద్ధులును గూడ దాని నత్యాసక్తితో జదువ జొచ్చిరి.

- స్వీ.చ.రెం.భా.పు. 175

హాస్య సంజీవనిలో బ్రాహ్మ వివాహము ముగిసిన తరువాత వ్యవహార ధర్మ బోధినియను పేర మరియొక గ్రంథమును గ్రామ్య భాషలో వ్రాసి ప్రచురించితిని. బ్రాహ్మ వివాహము ముగిసిన తరువాత వ్యవహార ధర్మ బోధినియను పేర మరియొక గ్రంథమును గ్రామ్యభాషలో వ్రాసి ప్రచురించితిని. బ్రహ్మ వివాహమునందు వలెనే యందలి పాత్రము లనేకము లు నిజమైనవి. ఇందలి విషయము లనేకములు నిజముగా జరిగినవి. బ్రాహ్మ వివాహమునువలె దీనిని గూడ జనులు విశేషముగా చదువుచు ప్లీడరు నాటకమని దీనిని పిలుచుచు వచ్చిరి.

- స్వీ.చ రెం భా.పు 176

నేను శ్రేయస్సుగోరియే మనవారిలోగల దుర్నీతిరుజలను జూపి ఇటువంటి యప్రియ గ్రంథౌషధ ప్రయోగమువలన బాగుచేయ జూచితినిగాని వారి యందలి ద్వేషభావముచేత గాదు.

- స్వీ.చ రెం భా పు. 178

ఇటువంటి నాచికిత్సలు కొన్ని సమయముల యందనిష్టములయి కార్యకారులు కాకపోయినను మొత్తముమీద విశేష ప్రయోజనమును గలిగించినవనియే నా నమ్మకము.

- స్వీ చ.రెం.భా.పు. 178

తప్పులకేమి యెన్నియైనను పట్టవచ్చును. లోకములో నెవ్వరును సర్వజ్ఞులు కాజాలరు. ఎంతటి విద్వాంసులు చేసిన పుస్తకములలోను తప్పు లుండవచ్చును. వెదకి విమర్శించువారున్నచో నా పుస్తకములలోను తెలిసియు తెలియకయు జేసిన తప్పులు కుప్పలుగా నుండవచ్చును.

- స్వీ.చ.రెం.భా.పు. 178

దుష్టగ్రంథములను సాధ్యమయినంతవరకు జదువక వానిని జూచినపుడెల్లను పెద్దపులిని జూచినట్టు భయపడుచు దూరదూరమున విసర్జింప వలయును.

మనవారు అలంకారములతోను మృదుమధుర వాక్యములతోను నిండి యుండి పయికి సొగసుగా గనబడుచు యౌవనవంతుల నాకర్షించి దిగమ్రింగుట కయి శృంగారప్రబంధములను పేరున లెక్కలేని కాలసర్పములను మన దేశములో విడిచిపెట్టి యున్నారు.

- ఉప.

మనలో కొందరు ఏదో యొక పుస్తకమును చదువుచుండుటచే జ్ఞానాభివృద్ధిం గాంచుచున్నామని సంతోషించుచున్నారుగాని అట్టివారు నిజముగా మోసపోవుచున్నారని మేము తలచుచున్నాము. ఏదో యొక చెడు గ్రంథమును చదువుచుండుట కంటె బొత్తిగా నేమియు జదువక యూరకుండుటయే సహస్ర గుణముల మేలైన పనియని మేము రూఢిగా జెప్పగలము

- ఉప.

తమ యభిప్రాయములితరులకు చక్కగా బోధపడకుండునట్లు పుస్తకములను వ్రాయుట కంటె మౌనము ధరించి యూరకుండుట యెంతయు నుత్తమము

- ఉప.

పండితులను కొనువారును హూణవిద్యా గంధమైనను లేనివారును పుస్తకములను రచియించుచు వచ్చుటవలన అట్టి గ్రంథములలో కఠిన పదములును దీర్ఘ సమాసములును కుప్పతిప్పలుగా నుండుట తప్ప ఉపయుక్తాంశములంతగా నుండవు.

జనులకు మత విషయమయిన జ్ఞానమును కలుగజేయవలయును గురువుల మని వేషములు వేసికొని మోసముచేసి ధనాపహరణము చేయువారి మోసములకు

లోబడుకుండునట్లుగా మన మత విషయమయిన చిన్న గ్రంథములను సులభశైలిని దేశ భాషలలో బ్రకటించి వానిని చదువునట్లు చేయవలయును.

- వివే. 1880

కొందరు పుస్తకములను తమ పాండిత్యమును కనబరచుకొనుటకే రచియించి యుండుటవలన నవి గద్య కావ్యములేయయినను కాఠిన్యమున పద్య కావ్యములకు మించి యుండియు వాని యర్థము కొన్నాళ్ళకు గ్రంథ కర్తలకే చింత్యముగా నుండియు జనులకంతగా ప్రయోజనకరముగా నుండుకపోవుచున్నవి.

- వివే. 1881

ప్రతి సంవత్సరము నందును మనదేశములో పలువురు పట్ట పరీక్షయందు కృతార్థులగుచు వచ్చుచున్నను జనోపయోగార్థముగా ప్రకృతి శాస్త్రములను దేశ భాషలయందు సులభశైలిని భాషాంతరీకరించి గాని తాము కృష్యాది వ్యాపారముల యందు బ్రవేశించి యావృత్తుల నవలంబించుటవలన గౌరవమున కెంత మాత్ర మును కొరతకలుగదని చూపిగాని క్షేమాభివృద్ధిని జేయువారు గానరాకున్నారు.

- వివే. 1881

చదువునకును జ్ఞానమునకును మిక్కిలి భేదమున్నది. ఎందునకుం బనికిరాని పురాణ గాథలతోను సత్యమునకు చాల దూరములగు విరుద్ధ కల్పనములతోను పిట్ట కథలతోను మనస్సులను నింపిన మాత్రమున జనుడెప్పుడును జ్ఞానవంతుడు కానేరడు.

- వివే. 1882

కేవల సాహిత్యపరులును సామాన్యశక్తి గలవారును వృత్తాంత పత్రికా లేఖనమునకు పూనుకొనుటవలన వారి వ్రాతయందు గూఢ పదములును దీర్ఘ సమాసములును క్లిష్టార్థ వాక్యములును యమకాదులును తప్ప ఉపయుక్త విషయము లంతగా గానరాకున్నవి. అట్టివారొక్క పదమునకు బహ్వర్థము లుండుటయు ఒక వస్తువును దెలుపుటకు బహుపర్యాయ పదములుండుటయు మాత్రమే భాషాభివృద్ధి యనుకొని యొక్క చిలుకపేరు చెప్పవలసి వచ్చినచో వచ్చినమాట రాకుండ పది పర్యాయపదములను వాడుచు ఒక్క హరిశబ్దమును పదిస్థలముల పది యర్థముల యందుపయోగించుచు తమ పాండిత్యమును కనబరప జూచుచున్నారే కాని జను లకు తెలివిగరపుటకయి లేశమయిన ప్రయత్నింప కున్నారు.

- వివే. 1882

ఓ విద్యానిధులారా మీలో కొందరు ప్రకృతి శాస్త్రాదులను భాషాంతరీకరించియు సులభవచనశైలిని నీతి బోధకములైన మంచి గ్రంథములను రచించియు వినోదకరములును జ్ఞాన ప్రదాయకములునైన నాటకములు చేసియు దేశమునకు మేలు చేయవచ్చును

- వివే. 1883

నీతి జ్ఞానబోధకములును సుబోధములునైన పుస్తకములు కావలసినవి యున్నంగాని దేశభాష మంచి స్థితియందున్నదని చెప్పవల్లకాదు.

- వివే. 1886

ఆంధ్రమునందు పద్యరూపమున రచింపబడిన పురాణములును ప్రబంధములును దప్ప మరి యేమియులేవు.

ఈ గ్రంథములలో కొన్ని జనసామాన్యమునకు బోధపడవు సరికదా వానిని రచించినవారికైన వ్యాఖ్యానములేక యర్థమగునో లేదోయని సంశయింపవలసినంత కఠినపాకమునందున్నవి.

ఎంతో కష్టపడి యట్టివానిని గురు ముఖమున నేర్చుకొన్నను నిరుపయుక్తములయిన కఠిన పదముల యర్థము ను తెలిసికొనుట తప్ప వానిలో దెలిసికొనదగినది మరి యేదియు నుండదు. ఉన్న యంశములనేకములు మరిచిపోయిన నే మేలు చేయునవిగా నుండును.

- వివే 1886

1889 వ సంవత్సరమునందు నేను 'తిర్యగ్విద్వన్మహాసభ' 'మహారణ్యపురాధిపత్యము' అను రెండు పుస్తకముల జేసితిని. వీనిలో మొదటిది నా మిత్రులైన బసవరాజు గవర్రాజుగారు మరణము నొందినప్పుడు వారి బంధువులను పురోహితులు మొదలయిన వారు పెట్టిన బాధలను జూచినప్పుడు వారి దుశ్చర్యలను వెల్లడి చేయవలెనన్న యుద్దేశముతో చేయబడిన యాక్షేపగర్భ సంభాషణము.

రెండవదియైన 'మహారణ్యపురాధిపత్యము'ను పై దానియట్ల యాక్షేపగర్భ నాటకమే.

ఇది సంఘములోగల వివిధ దురాచరణములను వెల్లడిపరచి వానిని మాన్పింపవలెనన్న ముఖ్యోద్దేశముతో వినోదకరముగా వ్రాయబడిన గ్రంథము.

- స్వీ.చ.రెం.భా.పు 208

స్త్రీల విషయమున మనవారు చేసిన యన్యాయములు తేటపడునట్లుగా వ్యాజ రీతిని సత్యరాజా పూర్వదేశయాత్రల యొక్క ప్రథమ భాగమును రచించి ప్రకటించితిని.

మనలోని దురాచారములను మూఢవిశ్వాసములను పరోక్షముగా ప్రదర్శించున ట్టి పుస్తకమును నాలుగు భాగములుగా జేయవలెనని బుద్ధిపుట్టి మొదట నీ భాగమును జేసితిని.

- స్వీ.చ.రెం.భా.పు. 205

# 10. బాలబాలికల నుద్దేశించి

ఏదురభ్యాసమయినను మొదట వచ్చుట సులభముగాని తరువాత బోవుట యంత సులభముగాదు. ఆలోచనలేని బాల్యదశయందు దురభ్యాసములవలీలగా నలవడును. కాబట్టి బాలురు తామెదుర భ్యాసములను జేసికొనక మిగుల జాగరూకులయి యుండవలె.

- స్వీ.చ.మొ.భా.పు 16

ఆరంభ దశలోనత్యల్పమైన దనుకొన్న దురభ్యాసమే కాలక్రమమున బల పడి కొంతకాలమునకు స్వభావమయి కడపట మార్చుకొనుట కెంతో కష్టసాధ్య మగును. బాలురు తోడివారేమి చేయుదురో దానిని దాము నుజేయజూతురు. పొడుమును, పొగచుట్టయు నలవాటగుట యీ విధముగానే.

- స్వీ.చ.మొ.భా.పు. 16

నిర్బంధించి చేయించు పని యందెప్పుడును శ్రద్ధానురాగము లుండవు

- స్వీ.చ.మొ భా.పు. 18

పదునారు సంవత్సరములు మొదలుకొని యిరువదినంవత్సరముల వర కును మనకు సుగుణములుగాని దుర్గుణములుగాని పట్టుపడ నారంభించి తరువాత నవిస్థిరపడి పోవును స్థిరపడిన తరువాత వానిని మార్చుకొనుట బహూతర ప్రయాస సాధ్యముగాని సుసాధ్యముకాదు.

- స్వీ.చ.మొ.భా.పు. 63

సామాన్యముగా సుగుణ దుర్గుణములు మన సహవాసములైన మిత్రులను బట్టి యలవడును, కాబట్టి యాకాలమునందు మిగుల జాగరూకులమయి శక్య మయినంత వరకు సన్మిత్ర సంపాదనమున కయి ప్రయత్నింపవలయును.

- స్వీ.చ.మొ.భా పు. 63

ఏదుర్వ్యక్తియైన నారంభము కాకయే యుండవలెను గాని కొంచె మారం భమైన తరువాత ముందుకు సాగక యారంభించిన చోటనే విలువదు.

- స్వీ.చ మొ.భా.పు. 64

స్వభావముచేత నెంతమంచి వాఁడయినను దుర్జన సాంగత్యములో బడిపోయి దుర్వ్యసనములలో దగుల్కొన్న పక్షమున దనవివేకమును గోలుపోయి తాను పూనిన వ్యాపారమే మంచిదనుకొను నంతటి దుస్థితిలోనికి వచ్చి మానహీనుఁడయిన దుష్టుఁడగును.

– స్వీ. చ. మొ. భా. పు 65

సత్కార్యబీజములను హృదయ క్షేత్రములయందు నాటించి సఫలములగు నట్లు చేయుటకయి బాల్యావస్థయే యుత్తమమైనది.

– స్వీ చ. రెం. భా పు 78

ఎల్లవారును బాల్యముననే సత్ప్రవర్తనము నలవరచుకొనుటయేగాక తాము పెద్ద వారయిన తరువాత దమ బిడ్డలను సహితము చిన్నతనములోనే సన్మార్గము నం ప్రవర్తింప నలవరచవలెను.

– ఉప.

లోకానుభవము విశేషముగా లేకపోవుటచేత బాలురు తరుచుగా నెల్లవారిని మిత్రులని నమ్మినవారి తోడ తమ రహస్యములను చెప్పుదురు. మిత్రులమని చేరవచ్చిన స్వప్రయోజనపరులయిన దుర్మార్గులనందరను ప్రాణమిత్రులనుగా నమ్మినందువలన సాధారణముగా బలునష్టములను బొందుటయే కాక యొకా నొకప్పుడు ప్రాణాంతకారియైన యాపదను సహితము తెచ్చుకొందురు కాబట్టి కపట మిత్రుల యెడ మిక్కిలి కనుగలిగి జాగ్రత్తగా మెలగవలయును.

– ఉప.

బాలుర కక్షరాభ్యాస కాలము నుండియు కొంచెము కొంచెముగా నీతి మార్గమున వర్తింపవలసిన యావశ్యకమును భగవంతుని ప్రేమించు రీతిని బోధించుచు వచ్చినచో వారు పెద్ద వారయిన తరువాత మంచి నడవడికగల వారగుదురు.

ఇప్పుడు సాధారణముగా పాఠశాలలందు చదువుకొను బాలురు నాస్తికులును పాప భీతిలేని వారును నగుచున్నారు. ఈయనర్థమును వారించుటకయి ప్రభుత్వము వారు సాధ్యమైనంత శీఘ్రముగా పాఠశాలలలో నీతిని భగవద్భక్తిని బోధించు పుస్తకములను నేర్పు విధుల నేర్పరతురని కోరుచున్నాము.

వివే. 1881

బిడ్డలు తాము చదవుకొన్నామని తల్లిదండ్రుల కంటె నెక్కువ వారమని గర్వపడక వారికి సమస్త విధములను గౌరవము చేయవలెను.

కొందరు తల్లిదండ్రుల యెడల నిజమయిన గౌరవము కలవారయినను మర్యాదలేక మోటు తనముగా మాటాడుచున్నారు.

అట్లు మాటాడుట యనాగరికతకు గురుతు కాబట్టి యెల్లవారును మృదుత్వము తప్పక మన్ననతో మాటాడుటకు నేర్చుకొనవలెను.

తల్లిదండ్రుల యెడ ప్రేమ అన్నిటి కంటెను ప్రధానమైన ధర్మము. ఇది లేకపోయిన యెడల తక్కిన వేమియున్నను నిరర్థకములు.

- సతి. 1888

మన సుఖము నిమిత్తమయి మన తల్లి దండ్రులెన్ని కష్టములు పడి యెన్ని సుఖములను సంతోషములను వదలుకొన్నారోజ్ఞప్తి యందుంచుకొనవలెను

- సతి. 1888

అసత్యము పలుకుటయు దొంగతనము చేయుటయు నెంత పాపమో యితరులతో కలహము లాడుటయు నంత పాపకార్యమే.

- సతి. 1884

తల్లిదండ్రులు తమ బిడ్డలకు మొట్టమొదట నేర్పవలసినది విధేయత.

- సతి. 1888

బిడ్డలకు తల్లిదండ్రులమాట వినని దుర్గుణము పట్టుపడిన పక్షమున అది వారిని పెంచెడి జననీ జనకుల లోపమే కాని యాశిశువుల లోపమెంత మాత్రము నయి యుండదు.

- సతి. 1888

ఒక్క కడుపుననె పుట్టి యొక్క కంచ
ముననె భుజియించి యొక మంచముననె పండి
యుండు తోబుట్టువగు చెలు సోదరులను
నెప్పుడ న్యోన్య మైత్రితో నొప్పవలయు.

- స్త్రీ నీతి దీపిక

అతివ యొకదానిలో గల్లలాడితేని
నెవ్వరును నమ్మకుండు దురెపుడు నిన్ను
నమ్మకము చెడ్డ వెనకను నరులలోన
జీవనము చేయుకంటెను చావుమేలు

- స్త్రీ నీతి దీపిక

తొలుత నెటువంటి వారల చెలిమిగలుగు
నట్టివారల గుణములేయబ్బుగాన
బాలికలు నిత్యమును మంచివారితోనె
చెలిమి దప్పక జేయంగవలయు బొమ్మ

- స్త్రీ నీతి దీపిక

తల్లిదండ్రులు చెప్పుహితంబు వినక
దుష్ట వర్తనులై స్వతంత్రుల మటంచు
నిక్కెదురు బాలకులు కొందరక్కటకట
సిగ్గుపడరౌర తమ దుశ్చేష్టలకును.

- నీతి కథా మంజరి

దుష్టులగు వారు పరులకు దొసగు చేయ
గారణం బేదొ కల్పింత్రు కలహమునకు
కావునను బుద్ధిమంతులు తావెరింగి
దుష్టులకును దూరంబుగా తొలగ వలయు

- నీతి

కష్టపడువారు లోకంబు తోడ
మొఱపెట్టరు తమ కష్టములను గూర్చి
నట్టి వారలెయరతురు మిట్టిపడుచు
గొడ్డు గేదెల కరవులు గొప్పకావె.

- నీతి

మంచి మాటలు పలె కెడు మనుజులెల్ల
మిత్రులనుచు భావించుట మేలుగాదు
మాట లధికంబుగా జెప్పు మానవులను
విశ్వసింపక యుండు వివేకి యెపుడు

- నీతి

బాల్య కాలంబునుండి యభ్యాసపడిన
సహజ గుణముల విడచుట సాధ్యమెందు
కావున సద్గుణంబుల గరము
చిన్ననాటి నుండియు మనసున నాటవలయు

- నీతి

వసుధ లోపల నరులను బాడుచేయ
స్తోత్ర పాఠకుల మించు శత్రువులు లేరు
లాభమొంద మభిస్తు తుల్పలుపువారి
వలల దగులక కను గల్గిమెలగ వలయు

- నీతి

తాత ముత్తాతెంత ధనము కూడ
బెట్టి పెట్టెలనిండంగ బెట్టియున్న
కష్టపడి న్యాయమార్గమున గడనసేయు
స్వార్జితము తోడ గవ్వకు సరియు గావు.

నీతి

# వీరేశలింగాన్ని గూర్చి ప్రముఖుల వాణి

వీరేశలింగం పంతులే ఉద్భవించిన వాళ్ళకు ప్రాణశక్తి ప్రసాదించి ఉండక పోయినట్లైతే తెలుగుదేశము, తెలుగు ప్రజలు ఈ స్థితిలో ఉండే వారు కారు. నిశితమైనలో చూపు, మహా సాహసము, అద్భుతమైన చైతన్య శీలముకల భారతీయ మహా పురుషులలో ఆయన ఒకరు. అసత్యాన్ని ఎదిరించి నిలిచి అభ్యుదయంకోసం తీవ్రమైన పట్టుదలతో అనుపమానమైన శక్తియుక్తులతో ఆయన పోరాడాడు. ఆంధ్రదేశమే కాదు ఆ మాటకువస్తే దక్షిణ భారతదేశమంతా కూడా ఆయనను తలచుకొని గర్వపడవలసి వుంటుంది

రా జా జీ

(1948 లో వీరేశలింగ శతజయంతి

పురస్కృత నివాళి)

దక్షిణ భారతదేశంలో సంఘంలో హేతువాదబద్ధమైన మార్పుల కోసం పనిచేసిన తొలిమార్గ దర్శకులలో వీరేశలింగం పంతులుగారొకరు. క్రాంత దర్శకులైన పథనిర్దేశకులందరివలెనే ఆయన అపార్థాలకు, హింసలకు గురి అయినారు. ఆయనవలెనే అవహేళనను ముప్పును కూడా సాహసంతో ఎదిరించి సాంఘిక నవావతరణం కోసం పాటుపడిన ఆయన ఋణం మనం తీర్చుకోవాలి.

సర్వేపల్లి రాధాకృష్ణ

(వీరేశలింగ శతజయంతి)

వీరేశలింగం పంతులుగారివంటి దేవతలను భారతదేశ మెప్పుడు మరిచి పోయిన అప్పుడు మనకు దుర్దశ సంప్రాప్తమైన దనియే చెప్పవచ్చును. పంతులు గారి వంటి ధైర్యము, ఉత్సాహము, కార్యశూరత మన దేశీయులలో నెప్పుడు

నాటగలమో అప్పుడే పంతులుగారి చిహ్నమును స్మరింప గలిగిన వారమగుదుమని నా అభిప్రాయము.

కట్టమంచి రామలింగారెడ్డి
( 1919 జూన్ 21, ఆంధ్రపత్రిక )

శ్రీ వీరేశలింగంగారి గ్రంథాల ముఖ్యమైన సారాంశాన్నిబట్టి ఆయన గారి జీవితంలోని ప్రముఖ ఘట్టాలనుబట్టి మానవోన్నతి కోసం పురోభివృద్ధి కోసం ఆయన ఎంత పాటుపడిందీ ఆ పరిపూర్ణ ప్రయత్నాన్ని తెలుసుకొనిమనం గాఢంగా ప్రభావితులమవుతాము,

రఘుపతి వెంకటరత్నం

# సంజ్ఞా వివరణం

| | | |
|---|---|---|
| వివే | — | వివేకవర్ధని |
| అవ | — | అవతారిక |
| స్వీ. చ. | — | స్వీయచరిత్ర (తృతీయ ముద్రణం - 1964) |
| మొ. భా. | — | మొదటి భాగం |
| ఈశ్వ | — | ఈశ్వర ప్రార్థనము |
| రెం. భా. | — | రెండవ భాగం |
| దేశీ | — | దేశీయ మహాసభయు దాని యుద్దేశములును |
| పు | — | పుట |
| ప్ర | — | ప్రచురణ తేది |
| ఉప | — | ఉపన్యాస మంజరి |
| బస | — | బసవరాజు గవర్రాజుగారి జీవిత చరిత్రము |
| రాజ | — | రాజశేఖర చరిత్రము |
| కవు | — | కవుల చరిత్రము |
| సత్య | — | సత్యవతీ చరిత్రం |
| చంద్ర | — | చంద్రవతీ చరిత్రం |
| నీతి | — | నీతిదీపిక |
| పున | — | స్త్రీ పునర్వివాహ విషయ కోపన్యాసము |
| గోదా | — | గోదావరి మండల సాంఘిక సభ |
| మాక | — | (శ్రీ)మాకర్ణ సుబ్బారావు నాయుడు సంస్మరణం |
| సత్యసం | — | సత్యసంజీవని |
| ఈస | — | ఈసప్ నీతికథలు నీతికథా మంజరి) |
| సతీ | — | సతీహితబోధిని |